# మానవతామూర్తి శ్రీమండలి

తిరుమల రామచంద్ర

కాపీలు: 500

*ప్రథమ ముద్రణ:*
27-09-2020

*ప్రకాశకులు:*
**మండలి ఫౌండేషన్**
గాంధీక్షేత్రం
అవనిగడ్డ - 521121
కృష్ణాజిల్లా

*ముద్రణ:*
**సాయిలిఖిత ప్రింటర్స్**
ఖైరతాబాద్, హైదరాబాద్ - 500 004.
ఫోన్: 7207045979

# విషయ సూచిక

# తెలుగు భాషాపురావస్తు పరిశోధనా పితామహుడు శ్రీ తిరుమల రామచంద్ర

- డా. మండలి బుద్ధప్రసాద్
పూర్వ ఉపసభాపతి, ఆంధ్రప్రదేశ్ శాసనసభ

అమితంగా గౌరవించి, మనసారా ప్రేమించే వ్యక్తుల గురించి ఎంత వ్రాసినా తనివి తీరనట్టే ఉంటుంది. శ్రీ తిరుమల రామచంద్ర గారితో అనుబంధం అలా అనిపింప చేస్తుంది.

1974లో అనుకుంటాను, సుప్రసిద్ధ చిత్రకారుడు శ్రీ పి.టి. రెడ్డిగారి ఇంటిలో వారి చిత్రప్రదర్శన ఏర్పాటు చేశారు. మా నాన్నగారు శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు విద్యాశాఖామాత్యులుగా ఉన్నారు. ఆ ప్రదర్శనని ప్రారంభించడానికి వెడుతూ నన్నుకూడా వెంట తీసుకువెళ్ళారాయన.

ముతక ఖద్దరు బట్టలతో, నుదుట సన్నగా నిలువు కుంకుమ బొట్టుతో చూపులకు అతి సామాన్యుడుగా కనిపించే ఒక వ్యక్తి నాకు తారసపడ్డారక్కడ. అప్పటికే ఆయన ఫోటోను చూసి ఉండటం, ఆయన పరిశోధనలను కొంత చదివి ఉండటం చేత ఆయనే తిరుమల రామచంద్రగారని గుర్తుపట్టి ఆయన దగ్గరకు వెళ్ళి నన్ను నేను పరిచయం చేసుకున్నాను. “మీ అభిమానమండీ! మీ హైదరాబాద్ నోట్‌బుక్ విడవకుండా చదువుతానండీ” అన్నాను. ఆయన ఆశ్చర్యంతో చూసి, కరచాలనం చేశారు. ఏ ముహూర్తాన వారి కరస్పర్శ కలిగిందో ఆ రోజు నుండీ వారితో ఆత్మీయ అనుబంధం ఏర్పడింది. విశేషం ఏమంటే వారిని అలా నేను పరిచయం చేసుకొని సన్నిహితుణ్ణికావటం వలన వారికి మా నాన్నగారితో సన్నిహితత్వం ఏర్పడటానికి కారణం అయ్యింది.

ఆనాటి సమకాలీన రాజకీయ నాయకుల్లో మా నాన్నగారిని అభిమానించినంతగా మరే నాయకుణ్ణి ఆయన అభిమానించటం గానీ, వారి గురించి వ్రాయటం గానీ చేయలేదనే చెప్పాలి. మా నాన్నగారి గురించి అనేక వ్యాసాలు వ్రాశారు. వాటిలో ఎక్కువ భాగం ఆయన మా నాన్నగారిని ఇంటర్వ్యూ చేసి వ్రాసినవే! ఏది వ్రాసినా, హృదయపూర్వకంగా, ప్రేమపూర్వకంగా మనసులోంచి మాటలు తీసి వ్రాసేవారు.

ఒక సందర్భంలో మా నాన్నగారి జీవితచరిత్ర వ్రాయాలని మొదలుపెట్టారు. “మండలివారి పూర్వులు” అని మొదటి అధ్యాయం పూర్తిచేశారు కూడా! అందుకోసం వయోవృద్ధులైన మా నాన్నగారి బంధుమిత్రులను కలవాలని అవనిగడ్డ వచ్చి, మా నాన్నగారి చిన్ననాటి విషయాలను అడిగి తెలుసుకున్నారు. మా కుటుంబ నేపథ్యాన్ని ఆయన అర్థం చేసుకోవటానికి ఆ విధంగా ప్రయత్నించారు. కానీ ఆ రచన పూర్తి కాలేదు.

అందుకు కొంతవరకు నాలోపం కూడా ఉంది. నేను అవనిగడ్డలోనూ, వారు హైదరాబాదులోనూ ఉండటం చేత పూర్తి సమాచారాలను ఎప్పటికప్పుడు అందించటం సాధ్యపడలేదు. సమాచార వ్యవస్థ ఇప్పటి అంత ఘనమైనది కాకపోవటం కూడా ఒక కారణం.

ఆయన పలు సందర్భాల్లో మా నాన్నగారి గురించి వ్రాసిన అనేక వ్యాసాలను ఒక సంపుటిగా ప్రచురించే అవకాశం ఈ రోజు కలిగింది. దివిసీమ ఉప్పెన సమయంలో మా నాన్నగారు నిర్వహించిన పాత్ర గురించి ప్రస్తుతిస్తూ, "మానవతామూర్తి శ్రీ మండలి" అని ఒక వ్యాసం వ్రాశారు. "అహంభో అభివాదయే" గ్రంథంలో ఇది చోటు చేసుకుంది. ఆ వ్యాసంలో రామచంద్రగారు ఉటంకించిన విషయాలను ఆ తరువాత చాలామంది వ్యాసకర్తలు ఉదహరించారు. హైదరాబాద్ నోట్‌బుక్‌లో ఈ క్రింది విధంగా వ్రాశారు.

"కాళిదాసు 'హేమ్నః సంతిక్ష తేహ్యా గ్నౌవిశుద్ధిః శ్యామికాసినా"- నిప్పులో పడితేగానీ, బంగారం నిగ్గు తేలదు అన్నాడు. "మోచేతుల కిందికి మోకాళ్ల మీదకి ఖద్దరు చొక్కా వట్టి బూటకం" అన్నారు కొందరు. పూలదండలు వద్దు పళ్లు ఇవ్వండి అని సలహా యిస్తే 'ఏదో కొత్త సూచన చేసి సాంప్రదాయాన్ని కాదని సూక్ష్మంలో గొప్పవాడు కావాలని ఎత్తు అన్నారు. రాష్ట్రంలో విచ్ఛిన్నకర శక్తులు చెలరేగినప్పుడు, తెలుగు జాతి ఒక్కటేననీ, అది విడిపోవటానికి వీలులేదని ఎలుగెత్తి చాటితే, 'ముఖ్యమంత్రి కావటానికి మరో పన్నాగ'మన్నారు. ఊరికి రానివ్వమన్నారు. ప్రపంచం నాలుగంచులా చెల్లాచెదురుగా యున్న తెలుగు భావ సమ్మేళనానికి ప్రపంచ తెలుగు మహాసభలు ఏర్పాటు చేస్తే "అబ్బో! అంతర్జాతీయ ఖ్యాతికి అంగలార్పు" అని ముక్కూ మూతీ విరిచారు. ఐనా శ్రీ మండలి వెంకట కృష్ణారావు మౌనంగా నిలబడ్డారు. ఆయనలో మానవతామూర్తి తుఫానులో బయటపడింది. తుఫాను దాడికి తునాతునకలైన తన దివిసీమను చూచి మండలి గుండెలు అవిసిపోయాయి. మృతుల అంతిమ సంస్కారానికి, మృతశేషుల భవితవ్య ఆవిష్కారానికి నడుముకట్టారు. రెచ్చకొట్టటము కాదు, కావాల్సింది వెచ్చని కన్నీరు కార్చటం అని నిరూపించారు. శవానికి సంస్కారము చేయటమే శివునికి ప్రీతి అని చాటారు. అలాంటి వారిది ఏ పార్టీ కాదు, మానవతాపార్టీ" ఇలా వ్రాశారాయన. మా నాన్నగారిని ఆయన ఎంతగా అభిమానించారో ఈ మాటలు సాక్ష్యం ఇస్తాయి.

శ్రీ తిరుమల రామచంద్రగారి వ్యక్తిత్వం మహోన్నతమైంది. నాకు శ్రీ రామచంద్రగారితో పరిచయం అయిన సమయానికి 18, 19 యేళ్ల వయసు నాది. ఆ వయసు కుర్రాళ్లు సహజంగానే కవులు, నవలా రచయితలు, కళాకారులంటే అభిమానిస్తారు. నేను అలా రామచంద్రగారి అభిమానినయ్యాను. ఆయనంటే అంత అభిమానం పెరగటానికి కారణం ఏమిటో నాకే అర్థం కాదు. బహుశా, ""ఆంధ్రప్రభ, "ఆంధ్రపత్రిక, "భారతి" పత్రికలలో ప్రచురితమైన వారి వ్యాసాలతో పాటు వారు నడిపిన శీర్షికలు నన్ను ప్రభావితుణ్ణి చేశాయి. "మరపురాని మనిషి" ద్వారా మహానుభావుల

పరిచయం నన్నెంతో ఆకర్షించింది. "నుడి-నానుడి", "సంస్కృతి-సంప్రదాయం", "తెలుగుతల్లి" మొదలైన ఆంధ్రప్రభ శీర్షికలు వారం వారం ఇష్టంగా చదువుతుండేవాడిని.

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో "హైదరాబాద్ నోట్‌బుక్" అంటే నా కెంత ఇష్టమో చెప్పలేను. "హైదరాబాద్ నోట్ బుక్"ని పుస్తక రూపంలో తీసుకువస్తే, ఆ నాటి రాజధాని విశేషాలు, సామాజిక చిత్రణ నేటి తరం తెలుసుకోవటానికి ఉపయోగపడుతుంది.

హైదరాబాద్ నోట్‌బుక్‌లో సికింద్రాబాద్ కోతుల బెడద గురించి ఈ విధంగా వ్రాశారు.

"కోతిని దైవంగా భావించే జాతి మనస్తత్వం ఎలాంటిదో తెలుసుకోవచ్చని మార్క్ మహర్షి అన్నా కోతి మన కందరికి పూర్వరూపమనే సిద్ధాంతం ఎలా ఉన్నా కోతుల బెడద మాత్రం చూస్తూ మిన్నకుండలేము. ఆంధ్రప్రదేశ్ రాముణ్ణి ఆరాధించే ప్రాంతం గనుకనే కోతులు ఎక్కువేమో ఈ రాష్ట్రంలో! కానీ, మనం ఎంత వానర భక్తులమయినా అవి మనకు పోటీ అయి, ఆహార పదార్థాలు పాడు చేస్తుంటే ఎలా? సికింద్రాబాద్ ప్రాంతంలో ఇటీవల కోతులు మందలుమందలుగా వచ్చి తోటలు, దొడ్లూ పాడుచేస్తున్నట్లు పౌరులు గోలపెడుతున్నారు. మునిసిపాలిటీ వారు శ్రద్ధ తీసుకోవటం అవసరం. కుక్కల బెడదలాగే ఈ బెడద కూడా! దీనికి డబ్బు కేటాయించటం, కేటాయించిన దానిని సవ్యంగా వాడి పౌరులకు రక్షణ కల్పించటం అవసరం" ఇలా ఉండేది "హైదరాబాద్ నోట్ బుక్" శీర్షిక పోకడ.

హైదరాబాదులో జరిగిన సభలు, సాంస్కృతిక కార్యక్రమాల విశేషాలే ఈ శీర్షికలో వ్రాయటం ఉద్దేశం అయినప్పటికీ, వాటిని వారు వ్రాసేపద్ధతి అద్భుతంగా ఉండి ఒక సజీవ చిత్రం వలె పాఠకులను సమ్మోహితులను చేసేవారు. వ్యాసం అంతా వ్రాసి, చివరన "ఉపశ్రుతి" అంటూ ఒక ఉపశీర్షిక పెట్టి అనేక చమత్కారాలు వ్రాసేవారు. అవి హాస్యాన్ని, వ్యంగ్యాన్ని రంగరించి ఉండేవి. మచ్చుకు కొన్ని:

"కురుక్షేత్రం చూచి వచ్చానండీ! అన్నాడు నా మిత్రు డొకడు అక్కడ జరిగిన ప్రాచ్యవిద్వత్సభలో పాల్గొని తిరిగివచ్చి! 'అంత దూరం ఎందుకు వెళ్లారు? మనరాష్ట్రం ప్రతిదానికీ కురుక్షేత్రమేగా?' అన్నాడు మా మాటలు వింటున్న మరో పెద్దమనిషి, మన రాష్ట్ర రాజకీయాలపై ఎంత చురక వేశారో చెప్పనవసరం లేదు.

"వానరాకడ-ప్రాణంపోకడ ఎవరికి తెలుసు?" పాత సామెత. లైట్లపోకడ- రైళ్ల రాకడ ఎవరికి తెలుసు?" అనేది కొత్త సామెత.

"చేయెత్తి జైకొట్టు తెలుగోడా! ఒకపాట మొదటి స్వరూపం. నేటి పరిస్థితులను బట్టి పాఠాంతరం: "చేయెత్తి జోకొట్టు తెలుగోడా" ఇది వేర్పాటు ఉద్యమాల సందర్భంలో వ్రాసిన వ్యాఖ్య.

"నేను టోపీ తిప్పడం మానివేశాను" అని ఆంధ్రపత్రిక హైదరాబాద్ ఎడిషన్ ప్రారంభోత్సవంలో శ్రీ బ్రహ్మానందరెడ్డి అన్నారు చూచారా!" అన్నాను ఓ రాజకీయవాదితో. "స్వామీ! రమణులు, రాజకీయవాదులూ అవునంటే కాదు, కాదంటే అవును అని గ్రహించమన్నారు మా గురువుగారు పట్టాభి" అన్నారాయన నాతో!"

"ఏమిటీ! ఇంకా మీరు అపక్వాహారమే పాటిస్తున్నారా? అనడిగారు ఒకరు నన్ను ఓ సమావేశంలో. భగవద్గీతలో కృష్ణుడు చెప్పినట్టు ఏదైనా జఠరాగ్నికి పక్వం కావాల్సిందే. కనుక జఠరంలో పడేవరకూ అంతా అపక్వమే... అన్నారు మా సంభాషణ వింటోన్న శ్రీ మండలి వెంకట కృష్ణారావు"

ఇటువంటి చమత్కారాలు ఎన్నెన్నో చదువుతూండేవాళ్లం.

నేను హైదరాబాద్ వెళ్లినప్పుడల్లా శ్రీ రామచంద్రగారిని కలుస్తూ ఉండేవాణ్ణి. వారు నాంపల్లిలోని ఇస్కాన్ దేవాలయంలో హరేకృష్ణ ఉద్యమానికి సంబంధించిన గ్రంథాలను అనువదిస్తూండేవారు. అక్కడ వారికి ఒక గది కేటాయించారు. సాయంకాలం పూట అక్కడకు వెళ్ళి ఆయన్ని కలిసేవాణ్ణి. ఆయన తన పని ముగించుకున్నాక ఇద్దరం కలిసి ఆదర్శనగరు వరకూ మాట్లాడుకుంటూ నడిచి వెళ్లేవాళ్లం.

ఆదర్శనగర్‌లో శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారి ఇంటి వద్ద ఆయన ఉండేవారు. నేను అక్కడ దగ్గరలోని ఎం.ఎల్.ఏ క్వార్టర్సులో ఉండేవాడిని.

ఆయన బహుభాషా కోవిదుడు. మహా పండితుడు. కానీ, ఆయన మాట్లాడేప్పుడు పాండిత్య ప్రకర్ష ప్రదర్శించేవారు కాదు. ఎంతో చనువుగా, సందర్భోచితంగా అనేక విషయాలను చెప్తూండేవారు. ఒక పండితుడితోనూ, సర్వజ్ఞుడితోనూ మాట్లాడుతున్న భావన ఎదుటివారిలో కలిగించేవారు కాదు. ఆయనకు ఒక విషయం తెలుసు... ఒక విషయం తెలీదు అనేది లేదు. అయినా ఏమీ తెలీనివాడిలా కనిపించేవారు.

శ్రీ రామచంద్రగారి వ్యక్తిత్వం మహోన్నతమైంది. పదవీ కాంక్షగానీ, ధనాశగానీ ఏ కోశానా ఉండేది కాదు. నాకిది కావాలనిగానీ, నాకిది చేయాలని గానీ ఏనాడూ ఎవరినీ అడిగేవారు కాదు. అడగనిదే అమ్మయినా పెట్టదన్న సామెత తెలిసినా అడిగేవారు కాదు. అసలు ఏ కోరికాలేని విరాగిలా కనిపించేవారాయన. వారితో నాకెంత సాన్నిహిత్యం ఉన్నా ఎప్పుడూ వారు కుటుంబ ప్రస్తావన తెచ్చేవారు కాదు. చాలాకాలం వారు బ్రహ్మచారేమోనని అనుకునేవాణ్ణి. వారి కుమార్తె వివాహ ఆహ్వానం పంపితే, అవనిగడ్డ నుండి బయల్దేరి హైదరాబాదు వెళ్లాను. అప్పుడు వారి కుటుంబ సభ్యులను చూడటం జరిగింది.

కొద్ది సంవత్సరాల క్రితం వారి కుమార్తె శ్రీమతి ఆముక్తమాల్యద చెన్నైలో ఒక సభలో కలిసినప్పుడు తమ తల్లిగారు తనవద్దే ఉన్నారని చెప్పితే అప్పుడు వారింటికి వెళ్లి శ్రీ రామచంద్రగారి సహధర్మచారిణి శ్రీమతి అనంతలక్ష్మిగారిని చూశాను. కుటుంబ

భారాన్నంతా మోసి, పిల్లల బాగోగులు చూచి, ఎన్నో కష్టనష్టాలను ఆనందంగా అనుభవించి శ్రీరామచంద్రగారి ఉన్నతికి తోడ్పడిన ఆ మహాతల్లిని చూచి ధన్యత చెందాను.

శ్రీ రామచంద్రగారు వ్యక్తిగతజీవితంలో నిరాడంబరత్వం, రచనావిధానంలో శిల్పవైభవం, ధనంపట్ల నిర్లక్ష్యం. పుస్తకాలంటే మమకారం, పదవులపట్ల వైముఖ్యం, బట్ట మాసినా, జుట్టు మాసినా పట్టించుకోని తత్త్వం... నేనెరిగిన శ్రీ తిరుమలరామచంద్రగారి లక్షణాలు.

తిరుమల రామచంద్ర సంపాదకుడు, రచయిత, స్వాతంత్ర్యసమరయోధుడు, తెలుగుతో పాటు కన్నడ, తమిళ, సంస్కృతం, ప్రాకృతాది భాషల్లో ప్రావీణ్యం కలిగిన భాషావేత్త. తనను తాను వినమ్రంగా భాషాసేవకుడు అనే ప్రతీసారీ అభివర్ణించుకునేవారు.

"ప్రజలే ప్రకృతులు. వారి భాష ప్రాకృతం. ఈ ప్రాకృతం అప్పటి మేధావులు చేసిన మార్పుతో - సంస్కారంతో సంస్కృతమయింది. ఈ సంస్కారం వేదాల ఆవిర్భావానికి ముందే జరిగింది. సంస్కృత ప్రాకృతాలు రెండూ సమాంతరంగా అభివృద్ధి చెందాయి. ఈ ప్రాకృతంతో మనకు గల సంబంధం దాదాపు మూడు సహస్రాబ్దాల నాటిది. మనకు బౌద్ధ, జైనాలతో కలిగిన ఘనిష్ట సంబంధంతో తెలుగు ప్రాకృతాల మధ్య పరస్పరం ఆదాన ప్రదానాలు జరిగాయి. ఈ భాషలు రెండూ జన్యజనక సంబంధం కలవా అన్నంతగా కలిసిపోయాయి." అంటారు శ్రీ రామచంద్ర.

సంస్కృతం అపభ్రష్టమై ప్రాకృతమయిందన్న సిద్ధాంతం అశాస్త్రీయమని, ప్రజల నిత్య వ్యవహార భాష ప్రాకృతమే సంస్కరింపబడి సమాజంలో ఉన్నత వర్గాల సొమ్మై, కాలం మారినా పొల్లుపోక, రక్షితమయిందని ఆయన ప్రతిపాదన.

కొన్ని శబ్దాలు దేశీ పదాలని, అవి ఆయా ప్రాంతాలకు సంబంధించిన పదాలని, పాలీ ప్రాకృతంలో తెలుగు శబ్దాలు చేరి ఉండవచ్చునని కూడా రామచంద్రగారు ఊహిస్తూ, ఆయా శబ్దాల పట్టికను రూపొందించారు. అంతేకాక ప్రాకృత భాష ప్రస్థానం నన్నయ కాలం వరకు రూపుదాల్చిన తీరుని ఆయన విశ్లేషించారు.

రామచంద్రగారికి గొప్ప కీర్తిని తెచ్చిపెట్టిన గ్రంథాలు "మన లిపి-పుట్టు పూర్వోత్తరాలు", "నుడి-నానుడి", "గాథాసప్తశతిలో తెలుగు పదాలు", "సాహితీ సుగతుని స్వగతం", "తెలుగు పత్రికల సాహిత్య సేవ" మొదలైనవి.

ఇతర భాషల్లో ఇలాంటి రచన లేదని తాపీ ధర్మారావుగారు, రామచంద్ర గారి 'మన లిపి- పుట్టు పూర్వోత్తరాలు' గ్రంథాన్ని ప్రశంసించారు. ఈ 2000 సంవత్సరాల్లో లిపి పరిణామక్రమాన్ని వివరించారిందులో.

'నుడి-నానుడి' తెలుగు నుడికారాల పుట్టుపూర్వోత్తరాల్ని, సామెతల్ని నిశితంగా పరిశీలించారు.

"గాథాసప్తశతిలో తెలుగు పదాలు" గ్రంథంలో 150 ప్రాకృత మూలగాథల్ని, ఏయే సందర్భాల్లో ఏయే అర్థాల్లో తెలుగు పదాలు కనబడతాయో వివరించారు.

'భారతి' మాసపత్రికలో అచ్చయిన తన వ్యాసాల్ని 'సాహితీ సుగతుని స్వగతం' (1969) గ్రంథానికి రాష్ట్ర సాహిత్య అకాడమీ ఉత్తమ సాహిత్య విమర్శ బహుమతి లభించింది. ఇతర పత్రికల్లో వచ్చిన తన రచనలను 'బృహదారణ్యకం' పేరుతో ప్రచురించారు. తనకు అత్యంత సన్నిహితులైన గురువులు మానవల్లి రామకృష్ణ కవి, వేటూరి ప్రభాకర శాస్త్రి, నిడుదవోలు వేంకటరావుల గురించి విశ్లేషిస్తూ 'మూడు వాఙ్మయ శిఖరాలు" గ్రంథాన్ని వ్రాశారు.

1935లో భారతి మాసపత్రికలో తన 22వ యేట వ్రాసిన తొలి రచన 'ఆంధ్రఛ్ఛందోవిశేషములు ప్రచురింపబడిందట. ద్విపదలో ప్రాసయతి విషయంలో వజ్ఝల సీతారామస్వామి శాస్త్రులుగారు ఆక్షేపణకు వేటూరి ప్రభాకరశాస్త్రి గారి సమాధానాన్ని సమర్థిస్తూ రామచంద్రగారు వ్రాసిన వ్యాసం ఇది. గిడుగు రామమూర్తిపంతులుగారు ఆ వ్యాసం చదివాక, రామచంద్రగారు పరిచయం అయినప్పుడు "ఈ కుర్రాడా? ఎవరో శాలువా పండితుడనుకున్నాను" అన్నారట. 'హంపీ నుంచి హరప్పా దాక' అనే గ్రంథంలో దీన్ని ఆయన స్వయంగా వ్రాసుకున్నారు.

చరిత్ర పరిశోధనలో శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ, భాషాపరిశోధనలో శ్రీ తిరుమలరామచంద్ర తెలుగు జాతికి చిరస్మరణీయులు. ఇద్దరూ డిగ్రీలు లేని పాండిత్యంబు వన్నెకు రాని యీ పాడు కాలాన బుట్టి... నాటి పూర్వ చరిత్ర కాణాచియెల్ల తవ్వి తలకెత్తుకున్నవారే! తమ నిరంతర పరిశోధన, పరిశ్రమ ద్వారా భావితరాలకు ఆదర్శప్రాయులయ్యారు. మల్లంపల్లి వారు పురావస్తు పరిశోధనతో తెలుగు జాతి ప్రాచీనతను లోకానికి చాటినవారు కాగా, రామచంద్రగారు భాషాపురావస్తు పరిశోధనా పితామహుడిగా పురావస్తు ఆధారాలు దొరకని చోట తెలుగు భాష ప్రాచీనత నిరూపణకు తెలుగు భాషాపదాలను ఆకరాలుగా తీసుకుని పరిశోధనలు కొనసాగించారు. గాథాసప్తశతిలో తెలుగు పదాల్లాంటి పరిశోధనా రచనలు ఇందుకు సాక్ష్యం.

1913 జూన్ 17న అనంతపురం జిల్లా రాఘవంపల్లిలో జన్మించిన శ్రీ తిరుమల రామచంద్ర 1997 అక్టోబరు 12న హైదరాబాదులో పరమపదించారు.

జీవితాలను నిత్య పరిశోధనాలయాలు చేసుకుని జీవించిన రామచంద్రగారికి జాతి ఎంతగానో ఋణపడి ఉంది. వారికిదే నివాళి.

మా నాన్నగారు 1997 సెప్టెంబర్ 27న మరణించారు. విచారాన్ని వ్యక్తపరుస్తూ కార్డు వ్రాశారు. అది నాకందిన రోజే వారు మరణించారు. వారు చిట్టచివర వ్రాసిన లేఖ అదేనేమో.

వారి పిల్లలు – శేషసాయి, నీరజ, ఆముక్తమాల్యదలకు పరిచయ వాక్యాలు వ్రాసిన ఆచార్య వేటూరి ఆనందమూర్తి, అందంగా ముద్రించిన 'పద్మశ్రీ' డా॥ యడ్లపల్లి వేంకటేశ్వరరావులకు కృతజ్ఞతాభివందనాలు. ■

# మానవతామూర్తి శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు

## గ్రంథరచన: డాక్టర్ శ్రీ తిరుమల రామచంద్రగారు

**సమీక్ష: వేటూరి ఆనందమూర్తి**

తెలుగునాట ప్రభుత్వ రాజకీయ రంగాలలో ప్రముఖ మంత్రివర్యులైయుండి, గొప్ప భాషా సేవకులుగానూ, అంతకు మించి మానవతామూర్తులుగానూ వాసిగాంచిన వారు మన మండలి వేంకట కృష్ణారావుగారు. అలాగే తెనుగు పత్రికారంగంలో ప్రముఖ స్థానాన్ని ఆక్రమించి, కర్తవ్యనిష్టగల సామాజిక స్పృహతో కూడిన భాషాసేవకులుగానూ, పండితోత్తములు గానూ ప్రఖ్యాతిగాంచిన వారు మా తిరుమల రామచంద్ర గారు. ఈ ఇద్దరు మహనీయులూ నివురుగప్పిన నిప్పులు. లోచూపుతో ఊది విశ్లేషిస్తేగానీ తమ లోతైన వ్యక్తిత్వపు ఉనికిని తెలియనివ్వని విశిష్టులు వారు. ప్రాతఃస్మరణీయులైన యీ ఆప్త లిద్దరినీ స్మరించే అవకాశం కల్పించిన మాన్య మిత్రులు శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారికి కృతజ్ఞతలు.

కృష్ణామండలం దివిసీమ పెదకళ్ళేపల్లి గ్రామ వాసులైన పెద్దలు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి వర్యుల సాహిత్య వంశంవారికీ, ఆ సీమలోనే సేవాప్రాభవాలతో వర్థిల్లిన మండలి వంశంవారికీ మధ్య తరతరాలుగా వర్థిలుతున్న మైత్రి, ప్రీతి, గౌరవమూ విలువ కట్ట లేనిది.

సంగ్రహంగా మనవి చేస్తాను.

మండలివారు విద్యా సాంస్కృతిక శాఖల మంత్రిగా ఉండగా, కీర్తిశేషులు కృష్ణమరాజుగారి చొరవతో మా పరిచయం ఆరంభమైనది. అది తాళ్ళపాకలో 1974 మే నెల ఆనంద వసంతంలో జరిగిన నా థీసీస్సు గ్రంథావిష్కరణోత్సవంతో మొగ్గ తొడిగి, క్రమంగా 1975 నాటి ప్రపంచ తెలుగు మహాసభల్లో విచ్చుకుంటూ, 1976లో మారిషసులో మహావైభవంగా జరిగిన రెండవ ప్రపంచ తెలుగు మహాసభల సందర్భాన పూర్తిగా విరిసి, పది దిక్కులా పరిమళింపసాగింది.

**కొన్ని జ్ఞాపకాలు:**

తాళ్ళపాకలో నా గ్రంథావిష్కరణ సభ నిండుగా జరిగింది. నాటి తి.తి.దేవస్థానం అధ్యక్షులు శ్రీయుతులు చెలికాని అన్నారావుగారు, మాన్య విద్యామంత్రి మండలి కృష్ణారావుగారు, ఎండోమెంట్ శాఖామాత్యులు సాగి సూర్యనారాయణ రాజుగారు, మరియు అప్పటి కమీషనరు, స్థానిక విద్వాంసులు, ఎమెల్యేలు చాలామంది వచ్చారు. అప్పుడో ఊహాతీతమైన దివ్యలీల జరిగింది! ఆవిష్కరణార్థం ప్రెస్సు నుండి డైరెక్టుగా

వేదికకు చేరిన పుస్తకాల కట్టను విప్పి విద్యాశాఖ మంత్రి మండలివారు ఆవిష్కర్తలైన రాజుగారి చేతి కందించారు. ఆయన గ్రంథాన్ని ఆవిష్కరించి తిరగేసి చూస్తుంటే అందులో అప్పుడే మింటు నుండి వచ్చినట్లుగా ఉన్న కొత్త 5/-రూపాయల నోటు కానవచ్చింది వారికి. విచారించిన పిదప అది ప్రెస్సు వారెవరో పెట్టింది కాదని తేలగా మంత్రివర్యులు తీర్మానించి దేవుడుపెట్టిన ఆ నోటును సభలోచూపి, ఆక్షన్ చేశారు. నాటి స్థానిక ఎమ్మెల్యే శ్రీమతి ప్రభావతమ్మగారు దాన్ని వేలం పాటలో రూ.501/-పెట్టి కొన్నారు. ఆ సొమ్మును మంత్రిగారు దేవస్థానం వారికి అందజేశారు. ప్రభావతమ్మగారు ఆ నోటును భద్రంగా తమ యింటి పూజామందిరంలో పెట్టుకున్నారని తెలుసుకొన్నాను. ఈ వార్త నాటి పత్రికల్లో ప్రముఖంగా వచ్చింది. అదంతా నా అదృష్టం. విద్యా మంత్రి సౌహార్థం, స్వామివారి అనుగ్రహం అనుకున్నాను.

1976లో మండలివారు మారిషస్ హిందీ మహాసభలకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వపక్షాన వెళ్ళవలసి ఉండినది. ఆ రోజుల్లోనే నేను ఐటెక్ ఎక్స్పర్ట్గా పదోన్నతిపై భారత ప్రభుత్వపక్షాన సకుటుంబంగా వెళ్ళవలసి ఉండెను. మా అఫిషియల్ పాస్పోర్టులు ఇంకా రాలేదు.నా థీసీస్సు రెండోవాల్యూం ప్రెస్సులో బైండింగ్ స్టేజిలో ఉండినది.

ఒక రోజు నేను క్లాసులో ఉండగా ఎడ్యుకేషన్ మినిస్టర్ గారి ఫోను, వారు పంపిన ఆఫీసు కారూ వచ్చినవి నాకోసం. ప్రిన్సిపాల్గారి అనుమతితో సెక్రటేరియెటుకి వెళ్ళాను. అడిగితే ఆయనకు నా వివరాలన్నీ చెప్పాను. మరునాడే మంత్రిగారి ఢిల్లీ ప్రయాణం. శని, ఆదివారాలు, మరో పండగ సెలవు! అయినా ఢిల్లీ ప్రభుత్వపు పనులు రాజకీయ బలముంటే అంత తొందరగా జరుగుతాయని నా కప్పటివరకూ తెలీదు. నాలుగో రోజున వాకిట్లో పేపరు చూద్దును గదా ఫ్రంటు పేజీలో బాక్సు కట్టి పెద్ద అక్షరాల్లో "పదోన్నతిపై ఆనందమూర్తిగారి మారిషసు ప్రయాణం" అంటూ పీ.టీ.ఐ. విడుదల చేసిన వార్త! అన్ని డాక్యుమెంట్లూ మండలివారి మూలంగానే ఢిల్లీ ప్రభుత్వం నాకు పంపించింది. మరో వారంలో ప్రయాణం ఖరారు. ప్రెస్సు నుండి ఇంకా పుస్తకాలు రాలేదు. లెక్కలు చూసుకోలేదు. మా తోడల్లుడు రామశేషుగారి మీద భారం వేసి సిద్ధపడ్డాను. నా పక్షాన వారే సహాయ పడ్డారు. ఆ పై వారం నేనూ, మండలివారూ ముంబాయిలో కలుసుకున్నాము. వారు, వారితోపాటు నాకూ ముంబాయి తెలుగువారి రిసెప్షనిస్టుల కోలాహలం! ఎయిరిండియా విమానంలో మా ప్రయాణం. అదే రోజున మారిషసు ప్రధానమంత్రి సర్ శివూసాగర్ రాంగులాం గారూ ఆ ఫ్లైటులో ఉన్నారు. నన్ను తోడుకొని వెళ్ళి మండలివారు ఎగ్జిక్యూటివ్ క్లాసులోని ప్రధానమంత్రికి ఉభయకుశలోపరి పరిచయం చేశారు. "I know him. We were already expecting him. Welcome to Mauritius" అన్నారు వారు. ఆ వారం పదిరోజులూ మారిషసులో పండగ వాతావరణమే. వరుసగా ప్రోటోకాల్ చొప్పున ఇండియన్ అఫీషియల్స్ ని, మారిషస్ ప్రధానమంత్రిని, ఉపప్రధాని సర్ వీరాసామి రింగాడూ గారినీ, ఇండియన్ హైకమీషనర్నీ, తక్కిన మంత్రుల్నీ, ఆంధ్రమహాసభ ప్రతినిధులందరినీ కలుసుకున్నాము.

ప్రపంచ హిందీ మహా సభలకు ఆహూతులైన గౌరవ అతిథులుగా మండలివారికి విశిష్ట సత్కారం జరిగింది. మాతో పాటే వచ్చిన శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తిగారు అప్పటి విశేషాలన్నీ ఫోటోలతో సహా తమ యాత్రను గూర్చిన విశిష్ట గ్రంథంలో వివరించారు. మరికొన్ని ఫొటోలు, ట్రాన్స్పరెంసీలు, నేను తీసినవి నా దగ్గిర ఉన్నవి. ఇవి అన్నీ దాచుకోవలసిన చారిత్రక ఘట్టాలే.

హిందీ సభల అనంతరం మండలివారు, తక్కిన ముఖ్య ప్రతినిధులందరూ ఇండియాకి తిరుగు ప్రయాణమయ్యారు. ఎయిర్ పోర్టులో నేను, మిత్రులం వీడ్కోలిచ్చాము. ఉద్యోగరీత్యా నేను మరో మూడేళ్లు అక్కడే ఉండిపోయాను.

1975-77ల్లో దివిసీమలో వచ్చిన భయానకమైన ఉప్పెనలో 10,000 మందికి పైగా చనిపోయారు. ఒకటిన్నర మిలియన్లకు పైగా యిళ్ళు కూలిపోయాయి. పశుసంపదకు అపారనష్టం. ఒకటిన్నర మిలియన్ హెక్టార్ల మేరకు పంట నష్టం. దాదాపు రెండు వందల కోట్ల వరకు ఆస్తి నష్టం. అప్పటి విలయాన్ని గూర్చి ప్రింటు ఎలెక్ట్రానిక్ మీడియాల్లో తిలకించి ప్రపంచం యావత్తూ చలించిపోయింది. అప్పుడు మండలివారు మానవతాప్రపూర్ణులై, సాక్షాత్తూ ఆర్తత్రాణపరాయణులైన శ్రీమన్నారాయణులే అయి చూపిన అపారమైన దయ, నిష్ఠతో చేసిన మానవ సేవలను కొనియాడడానికి కాదుకదా మాటల్లో చెప్పడానికైనా నాబోటి వారికి శక్తి చాలదు. ఆపని కొంతవరకు మా తిరుమల రామచంద్రగారు చేసి, తమ హైదరాబాదు నోట్‌బుక్ లాంటి రచనల్లో కళ్ళకు కట్టించారు. అట్టి మహనీయమైన మానవసేవలో మండలివారు తమను తామే మరచి, ఆర్తులతో మమేకమైన ఘట్టాలను చదువుతుంటే కళ్ళలో నీళ్ళు తిరుగుతాయ్. ఒళ్ళు కృతజ్ఞతా భారంతో ముకుళించుకు పోతుంది.

మన ఘనపర్వతాలనూ, జీవ నదీనదాలనూ ఆశ్రయించి మానవ నాగరికతా సంస్కృతులు ఎంతగా వికాసం చెందినవో అంతగా విలయమూ సంభవించింది భూగర్భంలోని టెక్టానిక్ ప్లేట్ల విద్ధూరపు సంచలనాల వలన! ఆయా వికాస విలయాల చరిత్ర రూపురేఖలు తెలియకుండానే భూగర్భంలో అంతరించిపోయింది. మనీషులైన ఏ మహాకవుల రచనల్లోనో, శాస్త్రజ్ఞుల కృషివల్లనో, మానవతా ప్రపూర్ణులైన మరి యే యితర మహనీయుల సత్కృత్యాల మూలంగానో, స్మృతుల రూపాన కొన్ని మిగిలి మనకు దక్కుతున్నవి. మన దేశంలో 17, 18 శతాబ్దాలలో కాబోలు, రౌద్రి నామ సంవత్సరంలో వచ్చిన గాలివాన, రక్తాక్షిలో చెలరేగిన భయంకరమైన బందరు ఉప్పెన, యిట్టి విలయాల్లో ఒకటి రెండు మాత్రం, ఎవరు రాశారో గానీ, నాన్నగారి చాటుపద్య మణిమంజరి (1913)లో చోటు చేసుకొన్నవి. అవి చదివితే మానవ హృదయం జలదరిస్తుంది. అలాగే నేటి మీడియా సహకారం వల్లనూ, రామచంద్రగారి రచనల మూలంగానూ, మండలి బుద్ధప్రసాద్ గారి ప్రత్యేక శ్రద్ధ వల్లనూ, మన తరం మరచి పోలేని(పోరాని) విధంగా మిగిలినదే 20వ శతాబ్దిలో జరిగిన విలయం కూడా.

మరో విషయం! మారిషసుకి వెళ్ళబోయే ముందు 1976లోనే, ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు భాషా బోధన విషయమై నేనూ, ఆచార్య జొన్నలగడ్డ శాస్త్రిగారూ కలిసి, సినారే గారి తోడ్పాటుతో రూపొందించిన ఒక బృహత్తర పాఠ్య ప్రణాళికకు విద్యామంత్రి మండలివారు అందించిన ప్రోత్సాహం మరువరానిది! కారణాంతరాల వలన ఆ కృషి అప్పుడు ఆరంభం కాకున్నా ఆ ప్రయత్నం మాత్రం విశిష్టమైనదని చెప్పవచ్చు. ఆ ఫైలు యూనివర్సిటీలోనే ఉన్నది.

విద్యామంత్రిగా ఒకసారి తమ మిత్రులను కలవడానికి మండలివారు మేమున్న విజయనగర్ కాలనీకి వచ్చారు. వారూ, వారి మిత్రులు శ్రీ చక్రపాణిగారూ కాలినడకన మా యింటికి వచ్చారు. చాలాసేపు జరిగిన సంభాషణల్లో పెదకళ్ళేపల్లిలో వేటూరివారి విగ్రహావిష్కారానికి సంబంధించిన ఆలోచన కూడా వచ్చింది. దాని పర్యవసానమే మండలి బుద్ధప్రసాద్ గారి పూనికతో, దేవస్థానం ఈ.ఓ. శ్రీ ఎల్వీ సుబ్రహ్మణ్యంగారి సహాయసహకారాలతో పెదకళ్ళేపల్లిలో గురుదేవులు ప్రభాకరుల, ప్రఖ్యాత సినీకవి వేటూరి సుందరరామమూర్తిగారల అద్భుత విగ్రహావిష్కారాలు తర్వాతి కాలంలో జరిగినవి.

వెనుక ఎప్పుడో నాన్నగారు 'మా తాత తాత – మరాఠీ వెంకటభొట్లు' అనే కథ రాయాలను కొన్నారు. ఈ సూచన వారి 'నా రచనలు' అనే నోట్‌లో ఉన్నవి. కానీ వారు ఆ కథ రాయలేదు! ఆ పని నేను చేద్దామని తలపోసి అప్పటి చారిత్రక విశేషాలను, మరాఠీదండు విషయాలను కొన్ని సేకరించాను. అప్పట్లో మాయింట మా తాతగారు సేకరించి జాగ్రత్త చేసిన ఆనాటి బల్లాలూ, శూలాలు వగైరా లుండేవని విన్నాను. కానీ నేనూ ఆకథ పూర్తి చేయలేకపోతిని. రామచంద్రగారు పరిశోధించిన మండలివారివంశ విషయాలు చదువుతున్నప్పుడు ఇవన్నీ గుర్తుకు వచ్చాయి. ఇలాంటి విషయాలు త్రవ్వి తీయడంలో రామచంద్రగారిది అందెవేసిన చేయి.

రామచంద్రగారి భాషా శక్తిసామర్థ్యాలన్నీ వెల్లడి కావలసినంతగా లోకానికి తెలియరాలేదు. అది కొంతలో కొంతగా ఇటీవలే మిత్రులు ఆచార్య బూదాటి వేంకటేశ్వర్లుగారు పూనుకొని కాశీ విశ్వవిద్యాలయం పక్షాన జరిపించిన సెమినార్ లోనే తొలిసారిగా వ్యక్తమైంది. ఇప్పుడు మండలి వారి గ్రంథంలో మరింత పుష్టిని చేకూర్చుకొన్నది.

శ్రీయుతులు మండలి కృష్ణారావు, తిరుమల రామచంద్రగారల దివ్యస్మృతికివే నా కైమోడ్పులు, జోహారులు!!!

# మండలివారి పూర్వులు

మండలి వారి పూర్వులు విజయనగర సామ్రాజ్యంలో 'సేనాపతులు, దక్షిణ భారతావనికి అంతటికి కన్నాకయి, ఆసేతు నర్మదా నదీపరివ్యాప్త భూమండలాన్ని ఆజ్ఞాబద్ధం కావించుకొని దక్కనీ పంచ పాదుషాలకు నియంత అయి, ఇరవై రెండేళ్ళ కాలం విజయనగర సామ్రాజ్యాన్ని మహావైభవంతో పాలించిన రామరాజు చివరకు మహమ్మదీయ రాజుల నయవంచనకు బేలుపోయి రాక్షసితంగడి రణరంగంలో రణశయ్యను అలంకరించాడు.

రామరాజు అప్పుడు భరత ఖండాన్ని పాలించిన హిందూ రాజులందరిలోను కడుదొడ్డ ప్రభువు. సనమకాలికాంధ) ప్రపంచం. అతనిని బడే రామరాజని, బడే రామప్పయ్య అని ప్రశంసించింది. అతడు మహా వీరుడు, రాజనీతి దురంధరుడు, శత్రుదుర్నిరీక్ష్యుడైనా, మితాహ్లాదనపరుడు. రాజసమూర్తి అయినా జనానురంజకుడు. కాని, అట్టి ప్రతిభాసంపన్నుని కాలంలోనే విజయనగర సామ్రాజ్యం అంతరించటం కాల వైపరీత్యం.

కొందరు చరిత్రకారులు చెప్పినట్లు నేటి లండన్ మహానగరాన్ని కూడా తలదన్నిన సువిశాల విజయనగరాన్ని విజేతలైన శత్రువులు సర్వనాశనం చేయడానికి ఆరునెలల కాలం పట్టిందట. కొన్ని లక్షలమంది సైనికులు అహోరాత్రాలు నగరంలోని ప్రతి మారుమూలా వెదికి ప్రతి ఇంటిని, ప్రతి దేవమందిరాన్ని, ప్రతి గ్రంథాలయాన్ని, ప్రతి విద్యాలయాన్ని, ప్రతి మంటపాన్ని, చివరకు ప్రతి స్తంభాన్ని కూడా ధ్వంసం చేశారు. ఆ మహా ఘోరాన్ని తట్టుకొని నిలిచిన కొన్ని శిథిలాలు మాత్రం నేటికీ ఆనాటి వై భవాన్ని ప్రేక్షకులకు చూచాయిగా చూపుతున్నాయి.

రాక్షసితంగడి యుద్ధం తెలుగు సామ్రాజ్యానికి తుది పిడుగుపాటు. ఆ మహోపద్రవంలో విజయనగరం నామరూపాలు లేక ధ్వంసమై పాడుపట్న (హాళు పట్నం) మైంది. కాని సామ్రాజ్యం అంతరించిపోలేదు. ఆ మహాకల్లోలంలో ఎవరికివారు ప్రాణాలు గుప్పిటపట్టుకొని పారిపోయి ఉంటారు. అలాంటి ఉపద్రవాలలో వెన్నుచూపడం పిరికితనం కాదు. సైన్యాలు నడుపుతున్న తొంబది ఏండ్ల మహావీరుడు రామరాజు ఎలాగూ హతుడయ్యారు. జయం సంభవంకాదు. కనుక ప్రాణాలయినా దక్కించుకుంటే ఎప్పటికయినా తిన్న ఉప్పు ఋణం తీర్చుకోవచ్చునని సామంత, సేనాపతి, సైనికుల భావం. కనుక తలకాచుకోక, తల దాచుకోక తప్పదు.

ఆ మహాప్రళయంతో విజయనగరాన్ని వదలి వెళ్ళారు శ్రీ మండలి వేంకట కృష్ణారావుగారి పూర్వులు. అప్పటి పరిపాలనా వ్యవస్థలో రాజులు తమ కనుకూలురైన నాయకుని ఆ ప్రాంతాల పరిపాలనకు నియమించే ప్రాచీనాచారం పోయి, అమరనాయకులనే మండలాధిపతులు, దుర్గదణ్ణాయకులు, జాగిర్దారులు, పారుపత్తెదారులు, హవల్దారులు క్రమంగా గ్రామాలపై ప్రత్యక్షాధికారులై ఉండేవారు. విజయనగర కాలపు దండనాయకులు, అమరనాయకులు కొందరు గ్రామప్రజలను పీడించి అదనపు పన్నులు వసూలు చేయడం, దానిని ప్రజలు భరించలేక గ్రామాలు విడిచి పారిపోవడం, కొందరు ఉదారులు, సచ్ఛీలురు రాజ్యహిత చింతకులు అయిన మండలాధిపతులు, మండలేశ్వరులు ఆ అదనపు పన్నులను తొలగించి, ఆ ప్రజలను మరల గ్రామాలకు పిలిపించడం జరిగేది.

రాజ్యం సీమలు, నాడులు అమరకాలు, మండలాలు అని విభక్తమై ఉండేది. అమరనాయకులు, మండలేశ్వరులు, దుర్గదణ్ణాయకులు పై పాలకులు. మండలమంటే విశాల ప్రాంతం. దానికి పాలకుడు మండలేశ్వరుడు. ఈ పదానికి పర్యాయాలే మాండలిక, మండలిక, మండలీక, మండలి పదాలు. ఈ మాండలికులు అన్ని కులాలలోను ఉండేవారు.

వెంకట కృష్ణారావు పూర్వులు ఏ మండలానికి పాలకులో తెలిపే సాక్ష్యాధారాలు విజయనగరంతో పాటే ధ్వంసమయ్యాయి. ప్రాణోపద్రవ సమయంలో శాసనాలు భద్రపరచుకోవడం సాధ్యమా? కనుక వారు ఏ మండలేశ్వరులో చెప్పలేము. మండలి వారిలాగే అడపా మొదలైనవారు కూడా విజయనగర సార్వభౌముల వద్ద సేవా నాయకులుగా ఉండేవారు. అడపా అంటే తాంబూలకరండం. విజయనగర సార్వభౌముల సన్నిధానంలో మెలిగే తాంబూలకరండ వాహకులు, చక్రచామరదారులు, అంగరక్షకులైన నేత్రదారులు (దొణ్ణే నాయకులు) ప్రధాన వార్తాహరులు. అందరూ ఉన్నత సైనికాధికారులే. అవసరమైతే వారు పరరాజులపై దండెత్తడానికి సిద్ధంగా ఉండవలసిందే! కృష్ణదేవరాయల అంగరక్షకులైన ఒకడు గొడుగు పాలుడు. ఇతడు రాయలు ఎప్పుడు ఎక్కడికి వెళ్ళినా ఛత్రం ధరించి వెంబడిస్తున్న మహావీరుడు. గొడుగు పట్టుకొని నిలబడిన శిల్పాలున్న పెక్కు శిలలు బళ్ళారి, అనంతపూరు జిల్లాలలో కనిపిస్తాయి. వీటికి గొడుగుపాలుని భూములని పేరు. గొడుగు పాలుడు దానమిచ్చిన భూములు, అట్లే రాయల అంగరక్షకులలో ఒకడయిన దొణ్ణేనాయకుడు (బాణాకట్టె నాయకుడు) దానమిచ్చిన గ్రామాలు ఉన్నాయి. వాటిలో ఒకటి నేడు-కంప్లీ కమలాపురం సమీపంలోని దొణ్ణే నాయకనపుర -దొణాపుర కొంత పరిశోధించి ప్రయత్నిస్తే, అదృష్టం కలిసివ స్తే, దాతృత్వానికి పేరుపొందిన మండలి వారి పూర్వుల చరిత్రాధారాలు విజయనగర ప్రాంతాలలో లభించవచ్చు.

ఇప్పుడు జీవించి ఉన్న మండలి వంశంలోని పెద్దలను ఎవరిని ప్రశ్నించినా తమ పూర్వులు ఆనెగొంది నుంచి తరలివచ్చినట్టు చెబుతున్నరు. మైసూరు రాజులతో వివాదమేర్పడి తుంగభద్రా తీరం నుంచి కృష్ణా తీరానికి వచ్చినట్లు శ్రీ మండలి రాజగోపాలరావు తెలిపారు. మెండు, మండలి, బండ్రెడ్డి, భోగాది అనే నాలుగు కుటుంబాలవారు ఎడ్లబండ్లపై ఆడవాళ్ళను, పిల్లలను ఎక్కించుకొని సముద్ర తీరానికి వచ్చి, తీరం వెంబడి పయనిస్తూ దివిసీమ చేరారట. మెండువారు బాపట్ల తాలూకా కాజీపాలెంలోను, మండలివారు దివిసీమలోని పులిగడ్డలోను, భోగాది వారు ఆ సీమలోని భావదేవరపల్లిలోను స్థిరపడ్డారట.

మండలివారు ఆనెగొంది నుంచి తరలివచ్చారనే విషయాన్ని ఆచార్య ఖండవల్లిలక్ష్మీరంజనంగారు కొంత కొంత చర్చించారు. వారి చర్చాసారాంశమిది.

విజయనగర యుగాన్నుంచి కూడా ఆనెగొంది అర్వీటి వంశనరపతులకు కాణాచి. ఆర్వీటి వంశాన్నేనరపతి వంశం అంటారు. ఇందుగుల వెంకయ్య కవి వ్రాసిన "నరపతి విజయం" ఆర్వీటి వంశీయుల కథనమే. దానిని అతడు అర్వీటి కోదండ రాజుకు అంకితమిచ్చాడు. కోదండ రామరాజు క్రీస్తుశకం 1640-50 ప్రాంతం వాడు.

కృష్ణదేవరాయల అల్లుడైన అళియరామశాజు అధికార పరిధిలో చేరి వుండేది. ఈ ఆనెగొంది పట్టణం, రాక్షసి-తంగడి యుద్ధంలో రామరాజు మరణించడం, రాజ్యం చిన్నాభిన్నం కావడం జరిగాయి. కాని, రామరాజు తమ్ముడు తిరుమలరాయలు మొదలయినవారు ఆ వజ్రాఘాతం నుంచి మళ్ళీ త్వరలోనే తేరుకొని, బలాలు కూడదీసుకొని విజయనగరం ముఖ్యపట్టణంగా 1567లో పరిపాలన సాగించారు. ఈ సమయంలోనే, తుంగభద్రకు ఉత్తరాన నరపతి వంశీయులు అనేగొందిలో కుదురుకొన్నారు. రాక్షస తంగడి యుద్దానంతరం అనేగొందిలో మొదట నిలదొక్కుకున్న వాడు అళియరామరాజు మూడవ కుమారుడైన కొండరాజు. ఇతడు అహమ్మద్ నగర్ నవాబు సేనలను గంగానది నుండి కృష్ణానది దాకా తరిమివేశాడు. రాక్షస తంగడి యుద్ధానంతరం మహమ్మదీయ సుల్తానులను యథాస్థానానికి నెట్టివేయడం కోసం జరిగిన కృషిలో కొండరాజు విజయం మొదటిది.

క్రీస్తుశకం 1567-1657 సంవత్సరాల నడుమ నరపతి వంశీయుల పాలనలో కొంచెం ఎగుడుదిగుడులు కలిగాయి. విజయనగర సామ్రాజ్య బలం వెన్నెముకగా లేకపోవడంచేత వీరికి స్థానబలం లేకపోయింది. ఉత్తరం నుంచి ముసల్మానులు పశ్చిమం నుంచి మహారాష్ట్రులు ప్రబల శత్రువులుగా ఉండడం చేత పరిస్థితి పాము నోటి కప్ప విధంగా వుండేది. 1656 ప్రాంతంలో ఆనేగొంది రాజ్యం మహారాష్ట్రుల వశమయి, అప్పటి పాలకుడు పేద వెంకటరాజు రాజ్యభ్రష్టుడయ్యాడు. ఉపాయశాలిని, సమర్థురాలు

అయిన అతని ధర్మపత్ని తిమ్మాంబ వకీలువెంట కృష్ణప్పతోపాటు తన కుమారులను మహారాష్ట్ర వీరుడు శివాజీ మహరాజు వద్దకు రాయబారం పంపింది. ఆ మహానీయుడు ఆవుల మొరను, ఆంధ్ర మొరను ఆలించేవాడు గనుక తిమ్మాంబ విజ్ఞప్తికి సంతసించి ఆనెగొంది వారికి కొన్ని గ్రామాలు తిరిగి ఇప్పించి వెండిరేకుపై శాసనం వేయించి ప్రసాదించాడు.

ఇట్లా పునర్నిర్మితమైన ఆనెగొంది రాజ్యం మరొక శతాబ్దం దాకా కొనసాగింది. ఎప్పటికప్పుడు ముసల్మానుల దాడులు, మహారాష్ట్రుల ఒత్తిడులు ఉండనే ఉండేవి. ఆ రాజవంశంలో పన్నెండవ వాడయిన వీర వెంకటపతి రాయుల కాలంలో అనేగొంది రాజ్యం మళ్ళీ విపత్తకు లోనయి లుప్తప్రాయమైంది. ఈ స్థితిలో తిరుమలరాజు అనే అతడు 1756లో కొన్ని గ్రామాలు, పట్టణాలు సంపాదించుకొని 1824 వరకు పాలించాడు. ఈతని శాలంలో అనేగొంది నామమాత్రంగా ఉన్నా, స్వతంత్ర ప్రతిపత్తిని కోల్పోయి బ్రిటీషు వారు, హైదరాబాద్ నిజాములు, టిప్పు సుల్తాను వీరి నడుమ కాలి బంతిలా అటూ ఇటూ అఘాతాలు అనుభవిస్తూ, దీనదశ పొందింది. రాశి కుప్పమ్మ ఈ శతాబ్దం తొలి పాదంలో పాలించింది. ఆమెకు వారసుడైన చివరి రాజు శ్రీకృష్ణదేవరాయల కాలంలో, దేశస్వతంత్రం కావడంతో తక్కిన సంస్థానాల లాగానే ఆనెగొంది కథావశేషమైంది.

ఈ చరిత్ర ఆధారంగా, మండలి వంశపూర్వులు ఆనెగొందిని ఎప్పుడు ఎందుకు వదలి ఉంటారని ప్రశ్నించుకుంటే 1725-50 నడుమ వదలి ఉండవచ్చునని తోస్తుంది. మండలి వంశవృక్షాన్నిబట్టి శ్రీ వెంకట కృష్ణారావు పూర్వులు ఆరు తరాలవారు స్పష్టంగా తెలియవస్తున్నారు. ఆ పురుషాంతరాలకు ఉజ్జాయింపుగా రెండు వందల సంవత్సరాలు లెక్క వేసుకుంటే శ్రీ చినపోతినీడు శ్రీ కృష్ణారావుకు రెండువందల సంవత్సరాలకు ముందు అనగా క్రీస్తుశకం 1725 ప్రాంతంలో వర్ధిల్లి ఉంటారని ఊహించవచ్చు. అప్పటికి చినపోతినీడు ప్రౌఢవయః పరిపాకంలో ఉండి ఉంటారు. ఈయన కాలంలో ఈ వంశంవారు ఆనెగొంది వదలి ఉండాలి. ఎందుకంటే శ్రీ పోతినీడు కుమారుడు శ్రీ కొండయ్య తరానికి మండలివారు దివిసీమ చేరుకున్నారు. కనుక శ్రీ చినపోతినీడు తరంలోనే అనేగొంది నుంచి నిష్క్రమించి ఉంటారు.

రాజ్యంలోని విపత్కర పరిస్థితులే ఈ వంశమూల పురుషుడైన చినపోతినీడు దేశాంతరాభిగమనానికి కారణమయి ఉంటాయి. క్రీస్తుశకం 1724-45 ప్రాంతంలో మొదటి ఆసఫ్‌జా నిజాముల్ ముల్క్ దక్కనులో స్వతంత్ర రాజ్యం స్థాపించుకున్నాడు. విజయనగర సామ్రాజ్యం ఎప్పుడో అవసన్నమైపోయింది. దానిస్థానంలో దాని మర్యాదలు పాటిస్తూ కొంత రాణించిన ఆనేగొంది రాజ్యం కూడా పొట్ల పండువలె కళ్ళముందే విచ్చిపోతూంది. శూరులకు, మేధావులకు అక్కడ అభ్యర్థిత స్థానం లభించే సూచనలు

కనిపించలేదు. ఆ అవకాశాలు అసఫ్‌జా రాజ్యంలోను, బ్రిటీషు వారి వద్దను లభించే సూచనలు కనబడుతున్నాయి. మ0డలి వారి పూర్వులు ఎంతటి స్వామి భక్తులైనా, జీర్ణ కర్ణాటక రాజ్యాన్ని అంటిపెట్టుకొని ఉండడం వల్ల ప్రయోజనం లేదని గ్రహించి, కృతజ్ఞతాభార వినమ్రమైన హృదయంతో 1725-50ల నడుమ అనేగొంది రాజ్యం వదలి, మొదట ఏలూరులోను, తర్వాత దివిసీమలోను పాత కాపులయి ఉంటారు.

మైసూరు రాజులతో కలిగిన వివాదంవల్ల మండలి వారు ఆనెగొందిని వదలి వచ్చారనుకుంటే ఆనెగొంది రాజ్యం టిప్పుసుల్తాను పరిపాలన కాలంలో మాత్రమే కొంతకాలం మైసూరు రాజులు వశంలోఉంది. మైసూరు రాజులతో వివాదమంటే టిప్పుసుల్తానుతో వివాదమే. వీర సేనానులయిన మండలివారు టిప్పుసుల్తాను పెత్తనాన్ని సహించలేక ప్రమాదం శంకించి తమకు అత్యాప్తులు, అత్యంతాత్మీయులు అయిన మెండు, బంగ్రెడ్డి, భోగాది వంశాల వారితో కలిసి ఆనెగొంది రాజ్యాన్ని విడిచి వెళ్లి ఉంటారేమో!

ఏమైనా నా మటుకు నాకు మండలి వారు రాక్షస తంగడి యుద్ధానంతర జనిత కల్లోలంలోనే విజయనగరమో, ఆనెగొందో వదలి వెళ్ళి ఉంటారని తోస్తుంది. దీనికి ఆ ప్రాంతంలోని నాయక వంశాల చరిత్ర పరిశీలించాలి. నా ఊహను శ్రీ మండలి కుటుంబరావుగారు వ్రాసిన “మండలివారి వంశావళి” బలపరుస్తున్నది. ఈ వంశావళి ప్రకారం చినపోతినీడు కాలం క్రీస్తుశకం 1570-90. ఈ వంశం వారంతా దీర్ఘాయుష్మంతులు. రాజ్యాల తరాల లెక్క వీరికి వర్తించదు. మండలి వారు రాజకీయ కల్లోలంలో విజయనగరం వదిలారు. ఎటుపోవాలి? దక్షిణాన, పశ్చిమాన, ఉత్తరాన మహమ్మదీయుల రాజ్యాలున్నాయి. అటు పోవడానికి మనస్సు ఒప్పలేదు. తూర్పున ఇంకా విజయనగర సార్వభౌముల పరిపాలనే వుంది. ఇదివరకు ఈ ప్రాంతం మండలివారికి పరిచితమే. వారు కృష్ణరాయలను కళింగ దిగ్విజయంలో అనుసరించిన సేనానాయకులు అయి వుంటారు. ఆంధ్ర విష్ణువు సన్నిధిలో కృష్ణరాయలు ఆసీనుడై పండితులతో చర్చించడం, తనే సేనాపతులతో చర్చించడం యుద్ధ వ్యూహాల గురించి ఆలోచించడం, ఆముక్తమాల్యద కావ్య రచనను ఊహించడం ఈ సేనా నాయకులకు తెలిసి వుంటుంది. కనుక తూర్పునకు తరలి దివిసీమ చేరి అక్కడ సౌందర్య సౌభాగ్యాలకు ముగ్ధులై అక్కడ స్థిరపడ నిశ్చయించి ఉంటారు. ఈ దివిసీమలో తొలిగడ్డ పులిగడ్డ. దీనిలో మండలి వారు నివాస మేర్పరచుకొన్నారు. తర్వాత వారి కార్యాచరణ రంగం దివిసీమ యావత్తూ అయింది. దివిసీమ వైభవాన్ని గురించి ఇదివరకే చెప్పుకొన్నాము.

విజయనగరం నుంచి తరలివచ్చిన మండలివారిలో చినపోతినీడు, పెదపోతినీడు అని ఇద్దరన్నదమ్ములున్నారు. వీరిలో చినపోతినీడు (1565- 1500) శ్రీ మండలి

వెంకట కృష్ణారావు వంశం మూలపురుషుడని ఇప్పటికి తెలిసిన పూర్వ చరిత్రనుబట్టి నిర్ణయించవచ్చు. చినపోతినీడు

కుమారులు నలుగురు. తిరుమలప్ప, కొండయ్య, అయ్యన్న, ముసలప్ప. వీరిలో రెండవవారు కొండయ్య. ఈయన దాదాపు వంద సంవత్సరాలు జీవించారని చెబుతారు. (1580-1680) ఈయన దైవభక్తి, ఉదార స్వభావమూ కలవారు. పులిగడ్డలో వేంచేసి వున్న శ్రీ వెంకటేశ్వరస్వామి వారి ఆలయం ప్రక్కన కోనేరు త్రవ్వించి ప్రజలకు మహోపకారం చేశారు. ఈయన పొడగరి. బలిష్టుడు, గంభీరుడు. ఎర్రగా దొండపండు వలె ఉండేవారట. పెత్తనం చేయడంలో ఈయన అతి సమర్థులు. మొదటి భార్య చనిపోయిన చాలా కాలం వరకు మరల వివాహం చేసుకోక పెత్తనం చేస్తూ ఉండేవారట. ఒకసారి ఎవరో "ముండ పెత్తనం చేస్తున్నాడు" అని ఆక్షేపించగా మరల వివాహం చేసుకొన్నారు. అప్పటికి ఈయనకు 90 ఏళ్ళ వయస్సు. కొండయ్య మొదటి భార్యకు ఆరుగురు కొడుకులు. చలమయ్య, రాజన్న, నరసన్న, సుబ్బయ్య, చిన రాజన్న, హనుమయ్య. రెండవ భార్యకు ఒక కూతురు, ఇద్దరు కునూరులు - నాగన్న, వెంకటాద్రి.

కొండయ్య నాలుగవ కుమారుడు సుబ్బయ్య కూడా దైవభక్తులు. (1670-1761) సంతర్పణలు అధికంగా చేసేవారట. ఈయనకు కూడ ద్వితీయ వివాహం జరిగింది. మొదటి భార్యకు ఒక కుమారుడు. నల్లస్వామి. రెండవ భార్యకు ముగ్గుకు కుమారులు. సీతయ్య, వెంకటాచలం, కొండయ్య. ముగ్గురు కుమార్తెలు. సోమమ్మ, మహాలక్ష్మి, అలివేలమ్మ. సుబ్బయ్య ఆకారం చాలా భయంకరంగా ఉండేదట. పదహారు మూరల తలపాగ, భుజంమీద పన్నెండు మూరల దుప్పటి, నీరుకాయిపంచె, తానెంత పొడవో అంతపొడవు బాణాకర్ర చేతపట్టుకొని, కిర్రుచెప్పులు తొడుక్కొని నడుస్తూంటే ఎదుటివారు భయపడేవారట.

సుబ్బయ్య మూడవ కుమారుడు వెంకటాచలం. (1771-1842) ఈయన ఆజానుబాహువు, బలిస్టుడు. బాణాకర్ర సాధన చేసినవాడు. ఒకప్పుడు తిరుపతి యాత్రకు బండిమీద ప్రయాణం చేస్తుండగా దొంగలు అడ్డగించారు. వారందరినీ తానొక్కడే ఎదుర్కొని చావబాదారట. తిరుపతి యాత్ర సుఖంగా పూర్తిచేసుకొని తిరిగివచ్చి ఆనాటి నుంచీ ప్రతి సంవత్సరం మాఘమాసంలో గ్రామస్తులకు, పేదలకు అన్నదానం చేస్తుండేవారట. ఈయనకు ఇద్దరు కుమారులు. వెంకటప్పయ్య, సోమయ్య. ముగ్గురు కుమార్తెలు. దుర్గమ్మ, వీరమ్మ లక్ష్మమ్మ.

వెంకటాచలం పెద్ద కుమారుడు వెంకటప్పయ్య (1942-1906) కూడా ఆజానుబాహువు, బలిస్టుడు. భారత, భాగవతాదులు చదువ నేర్చినవాడు. భక్తులు కావడం చేత ఇంటిముందు పాకవేయించి తరచు భజనలు చేస్తూ ఉండేవారు. తండ్రి,

తాతలు చేసిన దానధర్మాల కన్నా ఈయన ఎక్కువగా దానధర్మాలు చేశారు. ప్రతి మాఘమాసంలో సత్యనారాయణ వ్రతం, వెంకటేశ్వర దీపారాధన చేసి, వచ్చిన వారికి లేదనకుండా అన్నదానం చేసేవారు. అట్లాగే ప్రతి సంవత్సరం శ్రీరామనవమికి ఉత్సవాలు కూడా చేసేవారు.

ఈ వంశం వారికి పులిగడ్డలో 50 ఎకరాల మెట్ట భూమి మాత్రమే వుండేది. మాగాణి భూమి లేదు. ఈ కారణంగా వెంకటప్పయ్య కృష్ణకు అవతలి గట్టున రేపల్లె తాలూకా గంగడిపాలెం గ్రామంలో 40 ఎకరాల మాగాణి సంపాదించారు. ఈ గంగడిపాలెం భూముల ఎకరన్నరలో పండే వరి తమ గ్రామంలో పండే అపరాలు, కూరగాయలు, పాడి గేదెల నెయ్యి మొదలయిన వాటిని శ్రీరామనవమి కోసం సేకరించి పెట్టుకొని, ఆ ఉత్సవాన్ని వైభవంగా జరిపేవారు. మరుసటిరోజు దశమినాడు చుట్టుపట్టు గ్రామాల వారికి, స్వగ్రామంలోని వారికి అన్నదానం చేసేవారు. ఈ విధంగా యావజ్జీవం చేయడంవల్ల ఆస్తి అంతా దానధర్మాలకే హరించిపోయింది. ఈయన 1906వ సంవత్సరం జూలై నెలలో పరమపదించారు. ఈయన ధర్మపత్ని కృష్ణవేణమ్మ కూడా అనాడే కాలధర్మం చెందడం విశేషం. ఇలాంటిది కాకతాళీయమే అయినా అవురూపమైన సంఘటన. వెంకటప్పయ్య తన కుమారులకు ఆస్తిపాస్తులు మిగల్చకపోయినా, అపారమైన పుణ్యసంపదను అందించి పోయారు. ఆ సంపదే తర్వాత ఆ వంశం వారి ఉన్నతికి కారణమైందని వారి అభిమానులలో విశ్వాసం ఏర్పడింది.

వెంకటప్పయ్యకు అయిదుగురు కుమారులు. వెంకటచలం, కుటుంబం, వెంకట్రామయ్య, సత్యనారాయణమూర్తి, కుటుంబరావు. వీరిలో పెద్దకుమారుడు వెంకటచలం కాశీ, రామేశ్వరం, బదరీనారాయణం మొదలయిన క్షేత్రాలు దర్శించి, తండ్రివలెనే దైవకార్యాలకు అంకితులయ్యారు. ఆయుర్వేదంలో గొప్ప పాండిత్యం సంపాదించారు. ఆయనను జనం దాసుగారూ అని పిలిచేవారు. ఆయన అప్పటి నిజాం రాష్ట్రంలోని నాగుపల్లి గ్రామంలో ఆశ్రమం స్థాపించుకొని ఆధ్యాత్మిక చింతనలో గడుపుతూ, 1954లో 80వ ఏట స్వర్గస్తులయ్యారు. మూడవ కుమారుడు సత్యనారాయణ, అశ్వారావుపాలెం గ్రామకరణంగా పేరు ప్రఖ్యాతులు గడించి 1960లో కాలధర్మం చెందారు. నాల్గవ కమారుడు కుటుంబరావు, కాకినాడ, కలకత్తాలలో ఉద్యోగాలు చేసి, చివరకు స్వస్థలమైన పులిగడ్డకు వచ్చి ఉపాధ్యాయ వృత్తిచేసి 1959లో దివంగతులయ్యారు.

వెంకటప్పయ్య మూడవ కుమారుడు వెంకట్రామయ్య(1890-1969). తల్లిదండ్రులు ఆస్తి ఏమీ మిగల్చక కీర్తిశేషులయ్యే కాలానికి ఈయన తమ్ములందరూ చిన్నవయస్సు వారు. అన్న వెంకటచలం వేదాంతి అయి యాత్రలు చేస్తూ, కుటుంబ

విషయాలు పట్టించుకొనే వారు కారు. కనుక తమ్ముల భారమంతా వెంకట్రామయ్యపై పడింది.

ఈయనది చామనఛాయ. పొడగరి, బక్కపలచగా ఉండేవారు. సంస్కృతాంధ్రలలో ప్రవేశం వుంది. ప్రజలకు సేవచేయాలనే కుతూహలం ఎక్కువ. పట్టుదలలో ఉడుము వంటివారు. దైవభక్తులు. అవనిగడ్డలో ప్రాథమిక విద్య పూర్తి చేసిన పిదప కుటుంబ నిర్వహణ కోసం పాటుపడవలసి వచ్చింది. కనుక సర్వేశాఖలో, తమ సహ పౌరులు, చిన్ననాటి మిత్రులూ అయిన భోగాది వెంకట్రామయ్యతో పాటు చేరారు. ఆ విధంగా వీరిద్దరికి సన్నిహితత్వం ఎక్కువయింది. ఇది వియ్యమందడంలో చివరకు పరిపక్వమైనది.

వెంకట్రామయ్యకు ఆ సర్వేశాఖపని నచ్చలేదు. బడిపంతులపని మెరుగను కున్నాడు. 30, 40 మందిని పోగుచేసి పులిగడ్డలో వీధిబడి ప్రారంభించాడు. ఈ వీధిబడి 1905 నుంచి 1918 వరకు సాగింది. వీధిబడులలో ఉపాధ్యాయుని జీతాలకు ఎదుగుబొదుగూ ఉండదు. ఉపాధ్యాయ శికణ పొందితే జిల్లా బోర్డు పాఠశాలలోను, ప్రభుత్వ పాఠశాలలలోను చేరవచ్చు. తగినంత భద్రతా ఉంటుంది. ఈ ఆలోచనతో వెంకట్రామయ్య 1913 నుండి 1915 వరకు గుంటూరులో లోయర్ గ్రేడ్ ట్రైనింగ్ పొంది ఉత్తీర్ణులై 1915 నుండి 1921 వరకు దివి తాలూకా బోర్డులో మంగళాపురం ప్రాథమిక పాఠశాలలో ఏకోపాధ్యాయులుగాను, 1921 నుండి 1933 వరకు భావదేవరపల్లి ప్రాథమిక పాఠశాలలో ప్రధానోపాధ్యాయులుగాను పనిచేశారు. గాంధీ ప్రభావంతో విదేశీ వస్త్రాలను విడనాడి ఖద్దరు ధరించడమే కాక, విద్యార్థులను జాతీయ భావాలతో ఉద్బోధించేవారు. ఇలా చేయడంవల్ల రాజకీయాలలో పాల్గొంటున్నారనే సాకుతో ఈయనను తరచు ఇరుగు పొరుగు గ్రామాలకు బదిలీ చేసేవారు. ఈ విధంగా ఈయన 1934 నుంచి 1937 వరకు మునిపెడ, వడాలి, ఆలపాడు, అశ్వారావుపాలెం మున్నగు గ్రామాలకు బదిలీ అయ్యారు. ఈయనను ఎక్కడికి బదిలి చేసినా సెలవు పెట్టక బదిలీలు అపడానికి పై వారిని బతిమాలక– ఎక్కడికి మారిస్తే అక్కడికి వెళ్ళి పని చేశారు. 1937 నుండి 1947 వరకు భావదేవరపల్లిలో ప్రాథమిక పాఠశాల ప్రధానోపాధ్యాయులుగా వుండి 1947 జూలై 1వ తేదీన ఉద్యోగ విరమణ చేశారు.

వెంకట్రామయ్య ఆదర్శ ఉపాధ్యాయులు. విద్యార్థులకు పాఠాలు బోధపడేట్టు విశదంగా చెప్పడం, పాఠశాల గోడలపై నీతివాక్యాలు వ్రాసి వివరించడం, విద్యార్థుల జ్ఞానానికి అవసరమైన దేశపటాలు, కొండలు నదులు, దేవాలయాలు, రైళ్ళు మొదలైన పరికరాలను స్వయంగా తయారుచేసి విద్యార్థులకు చూపించడం ఈయన అలవాటు. ఈయన దగ్గర ఆనాడు చదువుకున్న వారంతా నేడు పెద్దపెద్ద నాయకులయ్యారు. వారిలో కమ్యూనిష్టు నాయకులు శ్రీ చండ్ర రాజేశ్వరరావుగారు ఒకరు. ఈయన ఏ విద్యాలయంలో పనిచేసినా ఆదర్శంగా ప్రవర్తించారు. సంస్థను ఆదర్శంగా నడిపించారు.

వెంకట్రామయ్య మంగళాపురం నుంచి భావదేవరపల్లి వచ్చారు. ఆ గ్రామ ప్రజలకు ఎంతో చేదోడు వాదోడుగా ఉండేవారు. ఈయన రామభక్తులు కావడం చేత కొంత ధనం పోగుచేసి రామాలయం కట్టించారు. ఆ గ్రామంలో రైతులకు భూవసతి తక్కువ. వారు బంజరు భూములలో సేద్యం చేసే వసతి కల్పించడానికి ఈయన అనేక అవస్థలు పడుతూ సొంత సొమ్ముకూడ వ్యయం చేసేవారు. ఈయన ఉద్యోగం చేస్తూనే మూడవ ఫారం ప్యాసయ్యి హైయర్ గ్రేడుకు వచ్చారు. జీతం పెరగవలసి ఉంది. కాని జిల్లా బోర్డ్ అధ్యక్షులయిన చల్లపల్లి రాజా శివరామ ప్రసాద్ జీతం పెంచలేదు. ఈయన జిల్లా బోర్డు మీద దావా వేసి విజయం పొందారు. కాని పలుకుబడిగల చల్లపల్లి రాజా దానిని రద్దు చేయించగలిగారు.

ఈయన ఉద్యోగ విరమణ చేసినప్పుడు నాగాయలంకలో గొప్ప సన్మానసభ జరిగింది. దానిలో పలువురు ప్రముఖులు ఈయన పెద్దరికాన్ని, ప్రజాసేవను ప్రశంసిస్తూ 'ఉపాధ్యాయ పితామహ' అని బిరుదం ఇచ్చి గౌరవించారు.

వెంకట్రామయ్యకు చిన్ననాటి నుంచే ప్రజాహితకార్యాలలో ఆసక్తి ఉంది. 1924లో భావదేవరపల్లిలో సహకార పరపతి సంఘాన్ని స్థాపించి, 1933 వరకు కార్యదర్శిగా, అధ్యక్షుడుగా ఉచితంగా పనిచేసి, సహకారోద్యమ వ్యాప్తికి తోడ్పడ్డారు. ఉద్యోగ విరమణ తర్వాత 1948లో భావదేవరపల్లిలో పంచాయతీ స్థాపనకు కృషి చేసి ప్రథమాధ్యక్షులుగా ఎన్నికయ్యారు. మూడు పర్యాయాలు అధ్యక్షులుగా ఉండి, గ్రామం చుట్టూ వున్న కాల్వలకు వంతెనలు, రోడ్లు, మంచినీటి బావులు, పాఠశాల భవనాలు, మున్నగు అనేక సౌకర్యాలు కలిగించారు. పశువుల ఆస్పత్రి, రూరల్ డిస్పెంసరీ నెలకొల్పడానికి కృషిచేశారు. పెక్కు శ్రమలకోర్చి మిడిల్ స్కూలు పెట్టించారు. ఉన్నత పాఠశాల సంఘానికి అధ్యక్షులుగా ఉండి హైస్కూలు స్థాపనకు, భవన నిర్మాణానికి కృషిచేశారు. భావదేవరపల్లి, కమ్మనమోలు, మందపాకల ప్రాంతాలలో నీటివసరులు, మురుగు కాల్వలు, రవాదారి సౌకర్యాలు, పేదలకు బంజరు భూముల పంపిణీ మున్నగు ప్రజోపయోగ కార్యాలకు నిరంతరం శ్రమించారు. ఎవ్వరికి ఏ సమస్య వచ్చినా ముందంజవేసి సహాయానికి ప్రయత్నించేవారు. ఆ ప్రాంత ప్రజలందరికి బంధువుగా మెలిగారు. ఇంటి పనుల కన్నా ప్రజాసేవకే ప్రాధాన్యమిచ్చారు.

ఆయన చివరి కోర్కెను బట్టి ఆయన ప్రజాసేవలో ఎంతగా నిమగ్నులయి ఉండేవారో తెలుస్తుంది. "ఉన్నత పాఠశాల స్థాపనకు ప్రారంభించిన భవనాన్ని, రామాలయాన్ని పూర్తిచేయాలి. సెకండరీ గ్రేడు ప్యాసయిన ఒక పేదవానికి ఉద్యోగం ఇప్పించాలి" ఇవి ఆయన చివరి గడియలలో వెలువరించిన కోర్కెలు.

దివి తాలూకాలో ఏ వయోవృద్ధులనైనా ప్రశ్నించండి. మండలి వెంకట్రామయ్య గుణగణాలు కీర్తించే వారే! ఆయనతో పనిచేసిన ఉపాధ్యాయులయితే ఆయనను దేవుడుగా భావిస్తారు. ఊరి కోసం చాల త్యాగం చేసిన మహానుభావుడు వెంకట్రామయ్య అన్నారు. మండలి రామయ్యగారు (పులిగడ్డ) "ఎప్పుడూ ఎవరకీ లేదనలేదు. పులిగడ్డ నుండి భద్రాచలానికి ఆయన ప్రతి ఏడు శ్రీరామనవమికి భజనచేసుకుంటూ నడిచివెళ్ళే వారని మండలి కోటయ్యగారు చెప్పేవారు. ఆ భజన బృందములో అమ్ముల నాగభూషణంగారు మద్దెల వాయించేవారట. భోగాది శేషయ్యగారు హార్మోనియం వాయించేవారట. భజనబృందంలో అద్దంకి రామస్వామి, బండాడ రామయ్య, అద్దంకి అమ్మన్న, ఆవుల రంగయ్యగార్లు మొదలయినవారు ఉండేవారట అన్నారు రామయ్యగారు.

"బంజరుభూములను ఆంధ్రలో మొదట పంచిపెట్టింది భావదేవరపల్లిలోనే. మా నాన్నగారు ఇంటిపనుల విషయంలో శ్రద్ధవహించేవారు కారు. మా అమ్మ మహంకాళమ్మగారే నిర్వహించేవారు. ఎక్కడి నుంచో జమ్మికర్ర తెప్పించి బావి కట్టించారు. పెద్ద రైతుల బంజరుభూములను మాజీ సైనికులకు పంచిపెట్టాలనే ప్రతిపాదన 1947లో వచ్చింది. దానిని ఆపడానికి మద్రాసు ప్రభుత్వం నుంచి ఉత్తర్వులు తెచ్చారు. 1950లో అమృతరావు నాయకత్వాన మాజీ సైనికులకు గ్రామంలోని పేదరైతులకు బంజరు భూముల అక్రమణ విషయమై జరిగిన పోరాటాన్ని ఎదుర్కొని, ఆక్రమణ జరగకుండా తగిన కట్టుదిట్టాలు చేశారు. తర్వాత కర్నూలు న్యాయస్థానంలో ఈ విషయమై రైతులకు న్యాయం జరగడానికి కృషిచేసి సఫల మనోరధులయ్యారు" అని భావదేవరపల్లి సర్పంచ్ మండలి జనార్ధనరావుగారు తెలిపారు.

వెంకట్రామయ్యగారు పదవీ విరమణచేసిన పిదప ఉన్నత పాఠశాల సంఘానికి అధ్యక్షులుగా ఉన్నారు. ఆయన కట్టించిన భవనాలు తుఫానుకు కూడా తట్టుకొని నిలబడ్డాయి. 'బాలకః శతమర్కటః' అని పెద్దలన్నారు. పిల్లలు, కోతులు చిలిపి చేష్టలు చేయడంలో సమానులు. వారిని చక్కదిద్దడానికి ఎంతో ఓపిక ఉండాలి అనేవారు ఆయన. ఆయనను నేడు తలవనివారు లేరు" అన్నారు కొండవీటి మల్లికార్జునరావుగారు.

వెంకట్రామయ్యకు రెండు వివాహాలు జరిగాయి. మొదటి భార్య పేరు భాగ్యావతి. ఈమెకు ఒక కుమార్తె-కృష్ణవేణమ్మ. రెండవ భార్య మహంకాళమ్మ. ఈమెకు ముగ్గురు కుమారులు. వెంకట కృష్ణారావు, నీలాంబరరావు, జనార్ధనరావు. ఇద్దరు కుమార్తెలు- బంగారమ్మ, రామారత్నం.

*(శ్రీ మండలి వేంకట కృష్ణారావు షష్టిపూర్తి సంచిక - 1986)*

# సమైక్యమూర్తి శ్రీ మండలి

శాతవాహనుల కాలంలో తెలుగుదేశం ఒక్క ఏలుబడిలో ఉండేదట. అది రెండువేల యేళ్ళనాటి మాట. కాకతీయుల కాలంలో తెలుగుదేశం ఒక్కటిగా ఉన్న సంగతి చరిత్రకు తెలిసిన మాట. కాని, మన దురదృష్టం! కాకతీయ సామ్రాజ్యం విచ్ఛిన్నమయింది. దేశం అన్యాక్రాంతమయింది. అన్య సంస్కృతిని అనుసరించిన వారి చేతిలో మన సంస్కృతి, ప్రజలు అష్టకష్టాలు పడవలసివచ్చింది. కాని, మన అదృష్టం "సంభవామి యుగేయుగే" అని కృష్ణభగవానుడు అన్నట్టు, తెలుగుదేశ సముద్ధరణకు ముసునూరి ప్రోలయ నాయకుడు, అతని సోదరుడు కాపయనాయకుడు నడుంకట్టారు. తెలుగునాడును కష్టాలనుండి గట్టెక్కించారు. తెలుగు సంస్కృతిని చెక్కుచెదరకుండా నిలబెట్టారు. ఇదంతా మనం చరిత్రలో చదివిన సంగతి. గ్రంథాల మరుగున ఉన్న ముచ్చట.

మరల ఇటీవల ఎందరెందరి సత్ప్రయత్నాలతోనో ఏకమయిన తెలుగునాడును, మూడు ముక్కలై మూడు రాష్ట్రాలుగా మారిపోతాయేమోనన్న భయం కలిగించే రెండు ఘోరోద్యమాలు ఉవ్వెత్తుగా లేవగా మేరునగ ధీరులుగా నిలబడి మూడుపాయలను గట్టిగా లాగి ముడివేసి మన కట్టెదుటే చరిత్రను నిర్మించిన ఇద్దరిని నిరంతరం చూస్తున్న నాకు ఆనాటి ప్రోలయనాయకుడు, కాపయనాయకుడు జ్ఞాపకం వస్తారు. ఆ చరిత్ర నిర్మాత లెవరో తెలుగువారికి నేను పేరు పేరున చెప్పనక్కరలేదు.

అయినా, వారిద్దరిలో ఒకరైన శ్రీ మండలి వేంకట కృష్ణారావుగారిని చూస్తున్నప్పుడు మాత్రం నాకు సమైక్యభావన, సమైక్యతత్త్వం, రూపుకట్టి నడయాడుతున్నవా? అనిపిస్తుంది. ఈ మహోద్యమానికి ఆనాటి కృష్ణసారథ్యం లాగ ఈనాటి కృష్ణారావు సారథ్యం శుభపరిణామదాయకమనడం నిస్సందేహం. 'సమైక్యం' 'సమైక్యం' అన్నది మండలి వారి నిరంతర జపం.

"ఈ రెండు ఉద్యమాలు తలుచుకుంటేనే నా మనస్సు కుతకుతలాడిపోతుంది. ఎంత నష్టం? ఎంత నష్టం? 600 కోట్లు నష్టమయింది! ఇది సామాన్యమైన మొత్తమా? ఒక పెద్దప్రణాళికే పూర్తయేది? అంతేకాక, మన రాష్ట్రం పరిశ్రమరంగంలో ముందడుగు వేయనున్న తరుణంలో ఈ ఉద్యమాలు - కాదుకాదు - ఈ కల్లోలాలు చెలరేగి, మన రాష్ట్రాన్ని పారిశ్రామికంగా, ఆర్థికంగా, సాంస్కృతికంగా కొన్ని వందలమైళ్లు వెనక్కు నడిపించాయి." అన్నారు వారు ఎంతో విచారంతో. నిజం! ఆ మధ్యన వంగ రాష్ట్రంలోని పారిశ్రామికులందరూ నక్సలైట్ల బాధపడలేక ప్రశాంతంగా వుంది తెలుగుదేశం. పరిశ్రమలు అభివృద్ధి చేయవచ్చు అనుకున్నారు. ఈ కల్లోలాలు చెలరేగగానే

తెలుగుదేశానికి వచ్చే తలంపే మానుకున్నారు. పరిశ్రమలే స్థాపితమయివుంటే, ఈ ఐదేళ్ళలో మన రాష్ట్రం ఎంత ముందుకు పోయేదో!

"ఇంతగా పెద్దఎత్తున ప్రపంచ తెలుగు మహాసభలు జరిపారు గదా? దాని ప్రభావం మీరనుకున్నంతగా ప్రజలపై పడిందా? అన్నాను.

"ఆ! తప్పక పడింది. ప్రజలలో, నిజానికి ప్రత్యేక భావం లేదు. కొందరు స్వార్థపరులు అమాయక ప్రజలను మభ్యపెట్టి పెడమార్గం తొక్కించారు. తమకు ఉన్నత పదవులు వస్తాయని, తమవారికి ఉద్యోగాలు వస్తాయని తప్ప మరేమీ కాదు. ఏ ఐదారువేలమంది ఉద్యోగాల కోసమో రాష్ట్రాన్ని, రాష్ట్ర సమైక్యాన్ని భగ్నం చేయడం ఏమి న్యాయం? ప్రపంచ "తెలుగు మహాసభలు ప్రజా

సామాన్యానికి తెలుగువారి వైభవం తెలిపి కనువిప్పు కలిగించాయి. ఇంత చరిత్ర,, ఇంతటి సంస్కృతి విలసనం ఉన్న మన తెలుగుజాతికి తలవంపులు కలిగించరాదనే భావం వారి మనస్సులో పాదుకొన్నది. మహానభలకు వచ్చిన జనమహాసాగరాన్ని చూసి విచ్ఛినకారుల గుండెలు అవిసిపోయాయి. ఇక విచ్ఛినశక్తులు తలఎత్తవని, ప్రజలు తలయెత్తనివ్వరని నా దృఢ విశ్వాసం అన్నారు మండలి వారు. తమ మనసులోని దృఢవిశ్వాసం మాటలలోను, కన్నులలోను ప్రస్ఫుటంకాగా.

"ప్రవంచ తెలుగు మహానభలలో" ఏర్పడిన సమైక్య భావాన్ని సుస్థిరపరచడానికి, తదనంతర కార్యక్రమాలు ఏమి చేస్తున్నారు మీరు?" అని అడిగే లోపుగానే, వారు నా మనస్సులోని భావం కనిపెట్టి చెప్పడం ప్రారంభించారు. "మనందరినీ కలిపేవి భాష, సంస్కృతి. ఏవో చిన్న చిన్న ఏసలు, ఉచ్చారణలో వున్న మూడు ప్రాంతాల భాష ప్రధానంగా తెలుగే. జనాన్ని కలిపే ముఖ్యమైన బంధం భాష అనేది అందరూ అంగీకరించేది. ఆంధ్రప్రదేశ్ రాగానే తెలుగును అధికారభాషగా ప్రకటించి ఉంటే, ఈ చిక్కులు, ఉద్యమాలు లేకపోయేవి. కాని, అప్పటి పరిస్థితులవల్ల అలా జరుగలేదు. ఇప్పుడు పరిస్థితులు అనుకూలించాయి. కనుక నిరుటినుంచే తెలుగును తాలూకా స్థాయిలో అధికార భాషగా చేశాము. ఇకమీద క్రమంగా జిల్లా స్థాయిలోను, రాష్ట్రస్థాయిలోను అమలుపరుస్తాము. ప్రభుత్వ వ్యవహారాలు తెలుగులో జరగడంతో జనంలో సమైక్యభావం దృఢమవుతుంది. మనను ఒక్కటిగా కలుపుతున్న రెండవ బంధం నంస్కృతి. మన సంస్కృతికి రెండు సహస్రాబ్దాల ప్రత్యక్ష చరిత్ర ఉంది. అంతకుముందున్న పరోక్ష చరిత్ర సంగతి మనకు వద్దులేండి. మూడు ప్రాంతాల సంస్కృతీ ఒక్కటే! కొన్ని ప్రాంతీయభేదాలు చిన్నచిన్నవి ఉన్నప్పటికీ ఇవి ఆయా ప్రాంతాల పండుగలు, ఆచార వ్యవహారాలు, కళలు మొదలయిన వాటిలో కనిపిస్తున్నా, ప్రధాన సంస్కృతీవాహిని ఒక్కటే. కనుక

ఆ వాహిని తెలుగువారి హృదయాలలో నిరంతరం ప్రవహించేట్టు చేయాలి. దీనికోసం ఒక ప్రాంతం కళారులను, విద్వాంసులను మరొక ప్రాంతంలో పర్యటించేటట్టు చేసి కళారంగాన్ని విస్తృత పరుస్తున్నాము. దీనివల్ల మూడు ప్రాంతాల కళాకారులలోను, విద్వాంసులలోను ఏకతాభావం బలపడుతుంది. ఈ విధంగా ప్రాంతీయ భావనను పోగొట్టడానికి ప్రయత్నిస్తాము. దీనికి మేధావులు సహకరించాలి." సంస్కృతి అప్పుడే సరస్వతీనదివలె జనహృదయంలో అంతర్వాహినిగా ప్రవహించినట్టు మూడు ప్రాంతాలలో త్రివేణివలె సంగమించినట్టు మండలివారి ముఖంలో మధురభావన పొంగులు వారింది.

"అయితే, మూడు ప్రాంతాల అభివృద్ధికోసం రాయలసీమబోర్డు, తెలంగాణాబోర్డు, కోస్తాబోర్డు - అని మూడు పేర్లతో ప్రమేయం ఏముంది? ఆ పేర్లను తొలగించి సమైక్య సూచకమైన ఒకేపేరు ఉండడం భావ్యం కాదా?" అన్నాను. వారు ఒకక్షణం ఆలోచించారు.

మందహాసంతో అన్నారు:

"నిజం. మీరన్నది. చాల బాగుంది విభేదాలు సూచించే పేర్లతో ఏమిటి ప్రయోజనం? పని ముఖ్యం. జిల్లాల పరిస్థితిని బట్టి వర్గీకరించి అభివృద్ధి, కృషి జరపాలి. కరువులు కాటకాలు తొలగి తేడాలు పోవడం ముఖ్యం. అలాటి కార్యక్రమాలు చేపట్టడం ముఖ్యం కాని, పేరుతో పని ఏమిటి? పేరులో నేమి పెన్నిధి గలదయా? అన్నారు వేమన యోగి" అని ఛలోక్తి విసిరారు.

పరిపాలకుల మనస్తత్త్వంలో మార్పులు రానిదే ప్రజలకు మేలు గలగదని మండలివారి విశ్వాసం. "కాకతీయులు మహాపాలకులు గనుక, విజయనగర సార్వభౌములు మహాసంస్కారం గలవారు గనుక ప్రజల శ్రేయస్సుకు ఎంతగానో కృషి చేశారు. తర్వాత వచ్చిన పాలకులు తమ అధికారం నిలబెట్టుకోడం కోసం జనంలో చీలికలు తెచ్చారు. ప్రజలలో స్వతహాగా విచ్చిన భావాలు లేవు. నాయకులకు తోడు అధికారులూ తమ స్వార్థంకోసం ముఠాలు కట్టారు. ఈ స్థితి నేడు తొలగింది. పాలకవర్గానికి సమైక్యబలం తెలిసింది. అధికారులు, ఉద్యోగులు పన్నుగడలకు పూనుకోడం లేదు. పూర్వం నుంచి వచ్చిన ప్రభుత్వోద్యోగులకు తెలుగు అధికారభాష కావడం ఇష్టం లేదు. కారణం వారిలో కొందరు ఇంగ్లీషు పాలనలో ఇంగ్లీషును, మరికొందరు ఉర్దూపాలనలో ఉర్దూను నేర్చుకొన్నవారు. తెలుగు అధికారభాష అయితే తమ ప్రాబల్యం తగ్గుతుందని వారి భయం. కాని, యువకులలో అలాటి భయం లేదు. తమ మాతృభాషలో పరిపాలన జరగడంవల్ల దాని స్థాయి పెరిగి, జాతీయ గౌరవం కలుగగలదనే నమ్మకం వారికుంది. ఇంతకూ, నేను ఇదివరకే అన్నట్టు ఐదారు వేలమంది ఉద్యోగులకోసం రాష్ట్రాన్ని విచ్ఛిన్నం చేయడానికి, ఎవరికో ముఖ్యమంత్రిత్వమూ,

ఉపముఖ్యమంత్రిత్వమూ లభిస్తుందని ఉద్యమాలు సాగిపోవడంగాని ఇక ఉండదు అన్నారు దృఢస్వరంతో. అల్లా విచ్చినకరశక్తులు తలఎత్తితే మనం బుద్ధిచెప్పాలి.

“మీరు కళాశాలలలో మెరుపు తనిఖీలు చేయడం ఉపాధ్యాయులలోను, తక్కిన సిబ్బందిలోను భీతాహం ఏర్పడింది. ఇలా దైనందిన కార్యకలాపాలలో మీరు జోక్యం చేసుకోడంవల్ల కల్లోలం ఏర్పడదా? ఐదు నిమిషాల ఆలస్యానికి సస్పెన్షన్ వంటివి పెద్దశిక్ష కాదా?”అని అడిగాను.

మండలి వారు పూర్తిగా గాంధీ సిద్ధాంతానుసారులు. అధికారం బాధ్యతను ఎక్కువ చేస్తుందని నమ్మేవారు. కనుక నా వైపు ప్రశాంతంగా చూస్తూ “దేశానికి స్వతంత్రం వచ్చి, దేశమంతా సంతోషంతో గంతులేస్తుంటే గాంధీజీ ఏమి చేశారో మీకు తెలుసా? తమ గదిలో విచారంగా కూర్చున్నారు. ఉపవసిస్తూ “నాయనా ఇది ఆనందతాండవానికి సమయం కాదు. బాధ్యత తెలుసుకొనడానికి ఉపవాసం చేయవలసిన సమయం. స్వాతంత్ర్యమంటే తెల్ల పాలకులు పోయి, నల్ల పాలకులు రావడం కాదు. మన భాధ్యత గుర్తించి ప్రజాక్షేమం ఏ విధంగా కలిగించాలని పథకాలు ఆలోచించవలసిన సమయం' అన్నారు. కాని మనం ఏమి చేశాము. స్వాతంత్ర్యాన్ని ప్రజల కోసం కాక, స్వార్థంకోసం అన్నివిధాల వినియోగించుగొనడానికి యత్నించామ్ముు ప్రజలను గాలికి వదలి పెట్టాము. అందువల్లనే జనంలో అవినీతి, సోమరితనం పాతుకుపోయాయి. ఎవరూ బాధ్యత గుర్తించదలచుకోలేదు. పొరుగునవున్న జపాన్, జర్మనీ దేశాలు చూడండి. జపానులో ప్రతి వ్యక్తి ఎనిమిది మొదలు పన్నెండు గంటలు, జర్మనీలో 14 గంటలు నడుం వంచి పనిచేస్తారు.

నీతి, నిజాయితీ, క్రమశిక్షణ, కార్యదీక్ష మనలో పెరగలేదు. సోమరితనం సోపానాలతో ఆకాశం అందుకున్నది. ఎవరి పని వారు సక్రమంగా నిర్వహిస్తే సరిపోదా? రంధ్రాన్వేషణే ఎక్కువయింది గాని, కర్తవ్యనిష్ఠ పెరగలేదు. వారి బాధ్యతను గుర్తుచేయడంకోసమే నేను అలా మెరుపు తనిఖిలు చేశాను. నిజంగా ఇబ్బందులు కలిగి సకాలానికి హాజరు కాని వారి విషయంలో ఎవరైనా దయ చూపవచ్చు. క్యాజువాలిటీ అనేది మనకు చెప్పిరాదు గదా! దాని విషయం వేరు. ఎవరేం చేస్తారులే అని, నా బంధువెవరో గొప్ప అధికారి అని పనిగట్టుకొని ఆలస్యంగా వచ్చేవారికి బాధ్యత గుర్తు చేయవద్దా! దైనందినోద్యోగంలో సక్రమంగా లేనప్పుడు నేను జోక్యం చేసుకున్నానే ప్రశ్నే లేదు. నాయకులు సరిగా ప్రవర్తించాలి. వారు సరిగావుంటే, దేశం బాగుపడుతుంది. ఉద్యోగుల కోసం ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావుగారు ఎంతో శ్రమతో జీతం పెంచారు. దానివల్ల ప్రభుత్వానికి 50 కోట్ల రూపాయలు అదనంగా ఖర్చు తగులుతుంది. దాన్ని పూడ్చడం కోసం 30 కోట్ల పన్నులు వేశాము. జీతాలు పెరిగినప్పుడు, ఉద్యోగులు తమ

బాధ్యతను గుర్తించి, కర్తవ్యాన్ని నిర్వహించాలిగదా! నాయకులలోను నేను చెప్పిన గుణాలు పెరగాలి" అన్నారు. నేను నిరుత్తురణ్ణై పోయాను.

మండలివారి తండి శ్రీ వెంకట్రామయ్యగారు ఉపాధ్యాయులు. ఆయన పూర్తిగా గాంధీ సిద్ధాంతానుయాయులు. న్యాయమార్గంలో నడవడం, నిర్భయంగా కర్తవ్యం పాలించడం, కష్టపడి పనిచేయడం. ఆయనవల్ల కుమారునికి సంక్రమించాయి. వెంకట్రామయ్యగారు ఆదర్శోపాధ్యాయులు. బోధన పరికరాలను స్వయంగా తయారుచేసి, విద్యార్థులకు బోధించేవారట. రైలుపాఠం వస్తే, చక్కలతోను, ఇనుప రేకులతోను రైలు తయారు చేసేవారట. అలాగే ఖగోళపాఠం వస్తే, దానికి తగిన పరికరాలు తల్లి గారు కష్టపడి పనిచేయడం తమ పిల్లలకు నేర్పారట. తల్లిదండ్రుల గుణాలే మండలి వారిని పూర్తిగా గాంధీవాదిగా తీర్చిదిద్దాయి. వారు రాజకీయాలలోనే కాక, నిత్యజీవితంలోను గాంధేయులు- గాంధీజీ 1942లో "క్విట్ ఇండియా" నినాదం ఇచ్చారు. అది దేశమంతటా ప్రతిధ్వనించింది. ఆ ప్రతిధ్వని మండలివారి కర్ణకుహరాలనూ తాకింది. దానితో ప్రభావితులై బందరు హిందూ కళాశాల నుంచి ప్రజోద్యమంలో అడుగు పెట్టారు. విద్యార్థి నాయకులై, యువజన నాయకులై గాంధీక్షేత్రం వంటి నిర్మాణాలకు కార్యకర్తలై లోక్‌సభ సభ్యులు, శాసన సభ్యులై, సాంఘిక సంకేమ మంత్రిత్వం నిర్వహించి ప్రస్తుతం విద్యామంత్రిత్వం నిర్వహిస్తున్నా, గాంధీ మార్గాన్ని, నిరాడంబరత్వాన్ని విస్మరించలేదు. సభలలో పూలదండలను వేసుకోవడం కూడా వారి దృష్టిలో ఆడంబరమే. కనుక దానికి అంగీకరించరు. సామాన్య ప్రజవలె బస్సులలో దూరప్రయాణం చేస్తారు. ఎవరన్నా అడిగితే, గాంధీజీ మూడవ తరగతిలో పయనించలేదా?- అని ప్రశ్నిస్తారు. ఆడంబరాలంటే వారికి ఎంత కంటగింపో!

"ప్రజలు ఏ కొంచెం మంచిని చూసినా మెచ్చుకొనే స్వభావం గలవారు గనుక, ప్రతినాయకుణ్ణి పెద్దజేస్తారు. మంత్రులో, అధికారులో టూర్‌కు వెళ్ళుతారనుకోండి. ప్రజలు వారిని పూలదండలతో, సన్మానాలతో, బిరుదులతో, వినోదాలతో ముంచెత్తుతారు. తమ సమస్యను ఏకరువుపెడుతూ నివేదికలు, అభ్యర్థనలు అందజేస్తారు. కొంతసేపటికి అభ్యర్థనలను అందజేయడమే కాని సమస్యల పరిష్కారానికి సూచనలు చేద్దాము; ఆడంబరాలు తగ్గించి, ముఖ్య సమస్యపై చర్చలు జరుపుదాము; పరిష్కార మార్గాలు అన్వేషిద్దాము; అధికారులు వచ్చిన నమయాన్ని వ్యర్థం చేయకుండా సవ్యంగా వినియోగించుకుందాము - అనే తాపత్రయం లేదు. ఫలితమేమిటి? మంత్రులు, అధికారులు ఏవో ప్రసంగాలు చేయడం అభ్యర్థనలను అందుకొని సచివాలయానికి తిరిగి వచ్చిన తర్వాత "పరిశీలించండి" అంటూ కార్యదర్శి మొదలయిన వారికి పంపడం, ఆ కాయితాలు సంవత్సరాల తరబడి కార్యాలయాల విభాగాలలో బల్లలపై పడివుండడం,

తర్వాత కొంత కాలానికి మరొకరు తిరగదోడగా, పైకి ఎక్కుతూరావడం పరిపాటి అయింది. కనుకనే నా పూర్వం కొన్నేళ్ళ క్రితం ఉన్న విద్యామంత్రి కాలంలోని కాయితాలు, ఫైళ్ళు ఇప్పుడు నా వద్దకు పెళ్ళినడకలతో వస్తున్నాయి" అన్నారు విచారంగా. నేను ఆశ్చర్యపడ్డాను. ఫైళ్ళు ఇంత భద్రంగా రెడ్ టేపు మీద సర్కసులో తీగమీద నడిచే జవ్వంగిలాగ జాగ్రత్తగా పడిపోకుండా వస్తున్నందుకు. ఏమైన వారు చెప్పిన దానిని ప్రజలు గుర్తించాలి. సమస్య పరిష్కార సూచనలు చేయాలి. తద్వారా పనులు త్వరగా రావడానికి సహకరించాలి.

మండలివారి భోజనం కూడా చాల నిరాడంబరమైనదీ, ఆరోగ్యకరమయినదీ. వారు ఉదయం, మధ్యాహ్నం కూడా తవిద అంబలి, కొద్దిగా వరి అన్నం, కూరగాయలు భుజిస్తారు. పూర్తిగా నిరామిషమైన భోజనం. సమయం విలువ తెలిసిన వారు గనుక ఉదయం 5-00 గంటలకు లేచి, రాత్రి 12-00 గంటలకు పండుకుంటారు.

'నేను 1965లో చెన్నపట్టణంలో జరిగిన తమిళ మహాసభను చూచాను. సమీక్ష కూడా చేశాను భారతిలో. మన ప్రపంచ తెలుగు మహాసభలే దానికన్నా బాగా జరిగాయి' అంటూ సెలవు తీసుకుందామని లేచాను.

"బాగా జరిగాయనడంలో సందేహం లేదు. ఒకరితో మనకు పోలికేముంది. మనము సాధ్యమైనంత బాగా జరిపాము. జనంలో నవ చైతన్యం కలిగింది. సమైక్యభావం పునాదులు గట్టిపడ్డాయి. అన్నిటికన్నా నాకు సంతోషం కలిగించిన విషయం ఏమిటంటే, పూర్వం రాష్ట్ర విచ్ఛేదాన్ని మహోగ్రంగా సమర్థించినవారు ప్రపంచ "తెలుగు మహాసభా వేదిక నుంచి రాష్ట్ర సమైక్యం అభ్యుదయానికి అవసరమని ప్రసంగించడం. ఇదొకటి చాలు ప్రజలలో మనః పరివర్తన కలిగిందనడానికి" అన్నారు.

"నేను సెలవు పుచ్చుకొని వస్తుండగా గుమ్మంలో - వరండాలో కనిపించారు మండలివారి జ్యేష్ఠపుత్రుడు శ్రీ బుద్ధప్రసాద్. తండ్రివంటి అదే ప్రశాంతత, అందమైన కళ్ళల్లో అదే కరుణాతరంగాలు; అదే మందహాసచంద్రికలు; అదే మాటలతీరు. ఔను! బుద్ధప్రసాద్ తండ్రిని మించిన కొడుకు అవుతాడు - అనుకున్నాను. పుత్రాదిచ్ఛేత్పరాజయం - అన్నారు గదా పెద్దలు.

*(శ్రీ మండలి వెంకట కృష్ణారావు 50వ జన్మదినోత్సవ అభినందన సంచిక - ఆగస్టు 1975)*

# దివిసీమ గాంధీ క్షేత్రం : మండలివారితో గోష్ఠి

ఉదయం ఏడున్నర. మంచి సమయం. మేడమీదికి రమ్మన్నారు. వెళ్లాను. తివాచీలు, దర్జీలు పరవని సామాన్యమైన గది. రెండు మూడు సోఫాలు. ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా ప్రజలు ఆదరంతో బహూకరించిన విగ్రహాలు, ఫలకాలు, వస్తువులు- తలుపులు తీస్తే పడిపోయేంత ఉక్కిరిబిక్కిరిగా అమర్చిన రెండుమూడు బీరువాలు, గోడల మీద ఎదురుబదురుగా ఒకవైపు తల్లిదండ్రుల, మరొక వైపు అత్తమామల పెద్దపెద్ద ఫోటోలు. ఎటుచూచినా, ఎంతసేపు చూచినా నిరాడంబరత ఉట్టిపడే పరిసరాలు, పద్ధతులు! మంత్రి కాదు కదా, ఏ పెద్ద అధికారి ఆఫీసు రూమని చెప్పినా నమ్మని అతిసామాన్య వస్తువులు - ఇది నేను చూచిన విద్యాశాఖామాత్యులు శ్రీ మండలి వెంకట కృష్ణారావు ఏకాంత కార్యకలాపాల గది స్వరూపం!

ఇక మండలి వారి వైయక్తిక వేషధారణ నిరాడంబరతకు పరాకాష్ట. తెల్లటి ఖద్దరు ధోవతి, అటు పూర్తిగా లాల్చీగాని, ఇటు హాఫ్ ఆరంగాని కాక వదులువదులుగా వుండే "కామరాజ్ నుమా" ఖద్దరుచొక్కా. సోఫాలో కూర్చుని ఏదో వ్రాసుకొంటున్నారు. గది ప్రశాంతత, మండలివారి నిరాడంబరత, బీరువాలలోని ఉపాయన వస్తువులనుండి పొడుచుకొని పైకి వస్తున్నట్టున్న నటరాజ విగ్రహం భంగిమ చూచి, గది పవిత్రతకు ఎక్కడ భంగం వాటిల్లుతుందోనని భయపడి పాదరక్షలు గది వెలుపలే వదలి గదిలో అడుగు పెట్టాను "నమస్కారమండీ!" అంటూ. ఏదో వ్రాసుకుంటున్న మండలివారు, వెనక్కు తిరిగి చూచారు. ప్రతి నమస్కారం చేసి, ఎదుటవున్న సోఫాలో కూర్చోమన్నారు. చేస్తున్నపనికి ఆటంకం ఎందుకని కూర్చుని చూస్తున్నాను. "రెండు నిమిషాలు" అన్నారు.

గదంతా కలయజూశాను. తెల్లటి ఖద్దరులో మూర్తీభవించిన ప్రశాంతతగా ఉన్న మండలివారిని చూచాను. రెప్పవాల్చక. ఆ రెండు నిమిషాలలోను నా మనస్సు ఎక్కడెక్కడో తిరిగి గాంధీజీని చేరుకుంది. ఔను! గాంధిజీని జనం పూర్తిగా విస్మరించిన ఈ కాలంలో, ఆయనను, ఆయన కార్యకలాపాలను, ఆశయాలను జ్ఞాపకం చేసేవారు - మండలివారిలాంటివారు లేకపోతే ఎలా అనిపించింది. మనస్సు, మానవ స్వభావం, కోతి వంటిదేకాదు, రాక్షసివంటివి. మంచి పనులను గురించి, అవి ఆచరించిన పెద్దలను గురించి తరచు చెప్పేవారు-చెవిలో ఇల్లు కట్టుకొని పోరాడేవారు కావాలి. లేకపోతే మనస్సు మరీ బ్రహ్మరాక్షసి అయిపోతుంది-అన్నాడొక మనస్తత్వవేత్త. అది నిజమేననిపిస్తుంది. నేటి ప్రజల ప్రవృత్తి చూస్తుంటే . . . అనుకుంటూండగా, "నా పని అయింది. మిమ్మల్ని అనవసరంగా కూర్చోబెట్టాను. ఇక చెప్పండి" అనే మండలివారి మాటలు వినిపించాయి. మళ్ళీ నా మనస్సు యథాస్థానానికి వచ్చింది. గాంధీజీని

మండలివారు ఇంతగా అనుసరిస్తున్నారు గదా! దానిని గురించే ప్రశ్నిద్దామని బుద్ధి పుట్టింది.

"ఆడంబరం, వ్యామోహం మితిమీరుతున్న ఈ కాలంలో గాంధీజీని గురించి అనుకునేవారు మీ వంటివారు దేశంలో వేళ్ళపై లెక్క పెట్టదగినవారు ఉంటారు. మీ పరిశ్రమ సముద్రంలో నీటి బిందువు. ఫలప్రదం కాగలదంటారా? . . . అన్నాను.

ఆయన ముఖంపై మందహాసం దోబూచులాడింది. నన్ను ప్రశాంతంగా చూస్తూ "మంచికి చెడుకు ఎప్పుడూ, అన్ని యుగాల్లోనూ సంఘర్షణ ఉంటుంది. మంచి ఎప్పుడూ కొంచెంగానే కనిపిస్తుంది. కాని, దాని ప్రభావం ఎక్కువ. చిన్న కిరణం చిమ్మచీకటిని పారదోలినట్టు మంచి చెడును భేదించుకుంటూ పోతుంది. ఇప్పటి పరిస్థితుల్లో ప్రజల సుఖశాంతుల కోసం గాంధీజీ కలలుగన్న రామరాజ్య స్థాపన కోసం గాంధీజీ ఆశయాలను అనుసరించడం తప్ప మరో మార్గం లేదు.

"అయితే ఈ ఆశయ సాధనకు మీరు చేస్తున్న కృషి ఏమిటి?" అని ప్రశ్నించాను.

"గాంధీజీ ఆశయాలను అనుసరించాలంటే చాలా కష్టసాధ్యమయిన విషయం. దానికి త్యాగం, ఓర్పు, నమ్మిక, ఆచరణ అవసరం. అయితే, నేను మంత్రిగా సామాన్య ప్రజల శ్రేయస్సుకు కృషి చేయాలని సంకల్పించుకొని నాకున్న ఏడెకరాల భూమిలో ఐదెకరాలు పంచిపెట్టడం, మంత్రికాగానే ఆస్తిపాస్తులను బహిరంగంగా ప్రకటించడం, బస్సుల్లో ప్రయాణం చేయడం, పొదుపును పాటించడం మొదలైన కార్యక్రమాలు ఆచరిస్తుంటే కొంతమంది హేళనగా మాట్లాడిన వారూ లేకపోలేదు. అలాటి పరిస్థితుల్లో గాంధీజీ ఆశయాలను అనుసరించడం అసాధ్యంగా కనబడుతుంది. అయినా, ఆయన మార్గం అనుసరించక ఎవరికీ గత్యంతరం లేదు.

"అయితే మరేం చేద్దామంటారు?" అని ప్రశ్నించాను.

"అంత మాత్రాన మనం నిరాశ చెందనక్కర్లేదు. గాంధీజీ ఆశయాల ఆచరణకు తగిన కార్యకర్తలను సమకూర్చుకోవాలి. ఈ దృష్టితోనే నేనూ, నా మిత్రులు కొందరం గాంధీ శత జయంత్యుత్సవాల సందర్భంగా 1969 అక్టోబరు నెలలో గాంధీక్షేత్రాన్ని లక్ష రూపాయలతో నెలకొల్పాము. గాంధీజీ ఆశయాల సిద్ధి కోసం నడుం కట్టాము." అన్నారు ఆయన.

"క్షమించాలి. గాంధీక్షేత్రం గురించి తెలుసుకోవడానికే వచ్చాను. ఈ పరిసరాలు చూచి అసలు సంగతి మరచాను, ఏదో సామెతలాగ" అంటూ గాంధీక్షేత్రం వివరాలు వినడానికి ఉత్కంటతో ముందుకు వంగాను.

గాంధీక్షేత్రం విస్తీర్ణం ఎకరం. దీని ఆశయాలు – (1) గాంధేయమార్గంలో సర్వజనులకూ సుఖశాంతులు చేకూర్చే సమసమాజ స్థాపనకు నిర్మాణాత్మకమైన కార్యక్రమాలు జరపడం, (2) ఈ కృషికి సహకారంగా విద్యావైజ్ఞానిక, సాంఘిక, సాంస్కృతిక, సాహిత్య సంస్థలను, శిక్షణాలయాలను నెలకొల్పడం, ప్రోత్సహించడం, (3) ఈ ఆశయాలకు, ఆచరణకు, శిక్షణకు, ప్రచారానికి అవసరమైన పుస్తకాలను, పత్రికలను ప్రచురించడం, (4) గాంధీక్షేత్రంలో స్థాపించబడిన, స్థాపించబడనున్న వివిధ సంస్థలను సమన్వయపరచి, నిర్వహించడం, సహాయసహకారాలు అందజేయడం, (5) గాంధీక్షేత్రంలోని వివిధ సంస్థల ఆస్తిపాస్తులను క్షేత్ర నిర్వాహక సమితి స్వాధీనంలో ఉంచుకొని కాపాడడం, అభివృద్ధి పరచడం, అవసరమయితే ట్రస్టుబోర్డు ఏర్పాటు చేయడం.

ఈ గాంధీక్షేత్రానికి వ్యవస్థాపకాధ్యక్షులు మండలివారు. అధ్యక్షులు – ప్రభాకర్ జీ. ఉపాధ్యక్షులు శ్రీ కాశీనాథుని పూర్ణమల్లికార్జునుడు, కార్యదర్శి – శీ కోట కేశవపెరుమాళ్లు (అధ్యక్షులు – దివిసీమ వైజ్ఞానిక సాంఘిక సేవాసమితి, సహాయకార్యదర్శి – శ్రీ కాగితాల నాంచారయ్య (దివిసీమ వైజ్ఞానిక సాంఘిక సేవాసమితి కార్యదర్శి), కోశాధికారి – శీ పాలడుగు వెంకటేశ్వరరావు, సభ్యులు –శ్రీయుతులు కోదాటి నారాయణరావు, విద్యాదేవి ఓం ప్రకాష్, పాతూరి నాగభూషణం, డాక్టర్ అడపా రామకృష్ణారావు, వేమూరి రాధాకృష్ణమూర్తి, అన్నపరెడ్డి సత్యనారాయణ, సనకా రాఘవయ్య, ఈడ్పుగంటి వెంకట సుబ్బారావు, మండలి బుద్ధప్రసాద్.

"గాంధీక్షేత్రమనే పెద్దపేరుకు తగినట్టుగా దాని ఆశయాలకు అనుగుణంగా వివిధ సంస్థలను  సమన్వయ పరుస్తున్నారా? ఎన్ని సంస్థలున్నాయి ఈ క్షేత్రంలో అని ప్రశ్నించాను. మండలివారు చెప్పిన సారాంశమిది:–

ఈ క్షేత్రంలో ఇప్పటివరకు దాచావు 16, 17 సంస్థలున్నాయి. ఇకమీద కొన్నిటిని స్థాపించనూవచ్చు. ఆ సంస్థలు ఇవి:– (1) దివిసీమ వైజ్ఞానిక సాంఘిక సేవాసమితి. ఇది 1965లోనే స్థాపితమై 1966లో రిజిష్టరయింది. ఈ సంస్థ వటవృక్షంలాగ పెరిగి, ఉపశాఖలేర్పడి, అవన్నీ ప్రత్యేక సంస్థలయ్యాయి. (2) దివిసీమ లలితకళా సమితి (3) దివిసీమ దీనజన సంక్షేమసమితి – ఇది ఒక అనాథ శరణాలయాన్ని నిర్వహిస్తున్నది. దీనిలో 40 మంది అనాథ బాలబాలికలున్నారు. (4) దివిసీమ మహిళా సేవాసంఘం. ఇది కండెన్స్‌డ్ కోర్సులు నిర్వహిస్తుంది (5) దివిసీమ బాలానంద సంఘం. దీనిని బాలబంధు శ్రీ బి.వి. నరసింహారావు 1969లో ప్రారంభించారు. ఇది రకరకాల పోటీలు నిర్వహిస్తుంది. ఈ సంఘం సభ్యులు 30 మంది 1973లో హైదరాబాద్‌లో జరిగిన అఖిల భారత బాలల మహాసభలో పాల్గొన్నారు. "జబ్బుకుదిరింది", "పిల్లిమెడలో గంట" అనే రెండు నాటికలు ప్రదర్శించారు. 1975లో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభలలో

"ఆంధ్రకేసరికి జోహార్లు" అనే అభినయ గేయం ప్రదర్శించారు. ఈ సంవత్సరం (1977లో) జరిగిన రాష్ట్ర బాలల మహాసభ సందర్భంగా జరిగిన నాటికల పోటీలో ఈ సంఘానికి కృష్ణాజిల్లాలో ప్రథమ స్థానం, రాష్ట్రం మొత్తంమీద (జూనియర్స్ ప్రదర్శించిన జబ్బు కుదిరింది నాటికకు) ద్వితీయ స్థానం వచ్చింది. (6) దివిసీమ సాహితీసమితి నెలకు రెండుసార్లు గోష్టులలో కవి సమ్మేళనాలు జరుపుతుంది. దీని యాజమాన్యాన ఓరియంటల్ స్కూలు పెట్టదలిచారు. (7) దివిసీమ వయోజన విద్యాసమితి. ఇది కేంద్రం స్కాలర్ షిప్పులతో వయోజనవిద్యా ప్రచారం చేస్తుంది (8) దివిసీమ యువజన సేవాసంఘం (9) దివిసీమ రైతు సేవాసంఘం (10) దివిసీమ హరిజన సేవా సంఘం (11) కృష్ణరాయ గ్రంథాలయ సంఘం (12) హిందీ మహావిద్యాలయం (13) గాంధేయ సమాజ సేవాసమితి. ఇది 300 మందితో ఒక సేవా శిబిరం నిర్వహించింది. దీనిలో గాంధీజీ సిద్ధాంతాల బోధన, శ్రమదానం ప్రధాన విషయాలు. దాదాపు 300 మంది తమిళనాడు, కర్ణాటక మున్నగు ఇతర రాష్ట్రాల నుంచి కూడ వచ్చి పాల్గొన్నారు. (14) హిందీ ప్రచారక విద్యాలయం. ఇది హిందీ ప్రచార శిక్షణ ఇస్తుంది. (15) ఉచితాయుర్వేద వైద్యశాల. ఇది రోజు 50 మంది రోగులకు ఉచితంగా మందులు ఇస్తుంది. (16) సంప్రదాయేతర విద్యా కేంద్రం. ఇది బడిచదువులేని పిల్లలకు ఉచితంగా చదువు చెప్పి, మనోవికాసం కలిగించే అపూర్వసంస్థ.

గాంధేయ సమాజ సేవాసమితిని గురించి వివరంగా చెప్పాలి. దీనికి కోదాటి నారాయణరావు అధ్యక్షులు. డాక్టర్ అడపా రామకృష్ణరావు డైరెక్టరు. 300 మందికి వారంపాటు శిక్షణ ఇచ్చే శిబిరాలు నిర్వహించింది ఈసంస్థ. ఉదయం 5-30 నుంచి. 6-30 వరకు శ్రమదానం దీని ప్రత్యేకత. మొదట శ్రీ ప్రభాకర్‌జీ ప్రారంభోత్సవం జరిపారు.

"ఇన్ని సంఘాలు, సంస్థలు ఉన్నాయన్నారు. వీటికి తగిన భవనాలున్నాయా? ఆశ్రయం లేకుండా ఏ సంఘ కార్యకలాపాలూ సవ్యంగా జరుగవు గదా?" అన్నాను.

"దీనిలోని ప్రతి సంస్థకూ భవనం కావాలి. కొన్నిటికి ఉన్నాయి. కొన్నిటికి శంకుస్థాపన జరిగింది. కొన్ని పూర్తి అయ్యాయి. కొన్నిఅర్ధ నిర్మాణావస్థలో ఉన్నాయి. వీటన్నిటికీ 12 లక్షల రూపాయలు కావాలి. విరాళాలు, గ్రాంటులు సేకరిస్తున్నాము. శ్రీ కోసూరు రత్తయ్య పేర గ్రంథాలయ భవనం 50 వేల రూపాయలతో నిర్మించాము. శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య సప్తతి పూర్తి భవనానికి లక్ష రూపాయలయింది. శ్రీ తిరుమలశెట్టి కుమారస్వామి 50 వేల రూపాయల వ్యయంతో మహిళా మండలి భవనాన్ని నిర్మించారు. శ్రీ శీలం వీరరాఘువయ్య ఒక గది కట్టించారు. శ్రీ చాపరాల బ్రహ్మానందరావు ఒక గాంధీ విగ్రహం బహూకరించారు. క్రింద మూడు విశ్రాంతి గదులు, పైన సకలాధునిక సౌకర్యాలున్న ఒక నేపథ్య కోష్ఠం (గ్రీన్ రూమ్) వున్న ఆరుబయలు రంగస్థలం 50 వేల రూపాయలతో నిర్మించాము, హిందీ మహావిద్యాలయం కోసం కస్తూర్బా భవనం 80

వేలతో నిర్మాణంలో వుంది. ప్రజల, ప్రభుత్వ సహకారంతో సేకరించిన నాలుగు లక్షలతో ఆడిటోరియం, మ్యూజియం నిర్మిస్తున్నాము. 50 వేల రూపాయల వ్యయంతో అనాథ శరణాలయం భవనం శ్రీ బండి శోభనాచలం విరాళంతో, సంక్షేమ సంఘ సహాయంతో నిర్మాణమవుతున్నది. ఈ భవనాలన్నీ పూర్తయితే గాంధీక్షేత్రం భారత దేశంలోనే గాంధేయ సంస్థలకు ఆదర్శప్రాయమవుతుంది" అన్నారు మండలివారు కళ్లలో ఆనందం మిరుమిట్లు గొలుపగా.

"ఇంత పెద్ద సంస్థగదా! తగిన కార్యకర్తలు, సిబ్బంది..." అంటూ నీళ్లు నమిలాను.

"ప్రస్తుతం 20 మంది కార్యకర్తలున్నారు. వారుకూడ తమ పనులు చేసుకుంటూ, తీరిక సమయాన్ని దీనికి పూర్తిగా వినియోగిస్తున్నవారు. సంస్థ పూర్తి స్వరూపం ఏర్పడిన తర్వాత చాలమంది కార్యకర్తలు, పూర్తి సమయం ఉద్యోగులు కావలసివుంటారు" అని సమాధానమిచ్చారు.

"ఈ సంస్థను మీరు ప్రారంభించారు. బాగుంది. దీని ప్రభావం పరిసర ప్రజలపై ఏ కొంచెమైనా పడిందా!" అని ప్రశ్నించాను.

"పడకేమి? ఆ ప్రాంతంలో దాదాపు ఏడెనిమిది సంవత్సరాలుగా తగాదాలు లేవు. అన్నిపార్టీల వారిని సమన్వయపరచి, వివిధ కార్యాలు నిర్వహిస్తున్నాము. ఇది పెద్ద విజయం కాదా? ఈ క్షేత్రం కార్యకలాపాలలో పార్టీ వివక్షత లేకుండా ఎవరన్నా పాల్గొనవచ్చు" అన్నారు. ఆయన.

"ఇలాటి సంస్థలు దేశంలో అవిరళంగా వున్నాయి. నాకు తెలిసినంత వరకు మన రాష్ట్రంలో తిరుపతిలో గాంధీ సేవాసంస్థ ఉన్నది. కేవలం పరిశోధనలు జరిపేది. మరికొన్ని పరిశోధనాలయాలు, స్టడీ సెంటర్లూ వున్నాయి. కాని, గాంధీక్షేత్రం లాంటి సంస్థ లేదేమో! ఈ సంస్థ సంపూర్ణంగా వికసించిన పిదప, మీరన్నట్టు భారతదేశంలోని గాంధేయ సంస్థలకు తలమానికమవుతుంది" అన్నాను.

మండలివారి కన్నులు ఆ స్వరూప సందర్శనానికో అన్నట్టు ఎక్కడో చూడసాగాయి.

దిగివస్తూ మండలివారి కుమారుడు శ్రీ బుద్ధ ప్రసాద్‌తో "గాంధీక్షేత్ర కార్యనిర్వాహకులలో మీరూ వున్నారు. గాంధీజీ మిమ్మల్ని ఆశీర్వదించుగాక! మీ నిష్కల్మష మనో మస్తిష్కాలలో ఈ కాలపు రాగద్వేషాల రంగునీడలు పడకుండుగాక! ముందుముందు దాని నిర్వహణ బాధ్యత పూర్తిగా మీమీద పడవచ్చు. ఆ భారం వహించడానికి సిద్ధంగా వుండండి" అన్నాను.

శ్రీ బుద్ధ ప్రసాద్ పెద్దకళ్ళూ నవ్వాయి మందహాసంతోపాటు.

*(ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర నాటకోత్సవాల ప్రత్యేక సంచిక - మే 1977)*

# మానవతామూర్తి శ్రీ మండలి

సరిగ్గా ఇరవై ఏడు నెలల మాట. తలచుకుంటేనే ఒళ్ళు జలదరిస్తుంది. ఆనాడు శనివారం 1977 నవంబరు 19. సూర్యుడు అనుదినమూ ఉదయించినట్లే ఆ దినమూ ఉదయించాడు. ప్రజలు నిత్యకృత్యాలు యథావిధిగానే సాగించారు. కానీ ఒకటే భేదం. తుఫాను సూచనలున్నాయి సుమా! జాగరూకతో మెలగాలి సుమా!... అని వాతావరణవేత్తలు హెచ్చరికలు చేశారు. సరే, ఎప్పుడూ ఉన్నవే ఈ తుఫానులు ఎన్నో వచ్చాయి. నిలువదొక్కుకున్నాము. ఇది కొంచెం తీవ్రమైనదేమో! ధైర్యంతో నిలబడదాము. అంతకన్నా ఏం చేయగలం? – అనుకున్నారు దివిసీమ వాసులు. పాపం! వాళ్ళకేమి తెలుసు వంద సంవత్సరాల క్రితం మచిలీపట్టణాన్ని ముంచెత్తి, వేలకొలది ప్రజలను పొట్టన పెట్టుకున్న ఉప్పెన కన్నా పెద్ద జలప్రళయం తమపై వికటాట్టహాసంతో విరుచుకొని పడుతుందని, తమను నామరూపాలు లేకుండా చేస్తుందనీని? కొన్ని గంటలలో అంతా సమాప్తమయింది. సముద్రుడు ఎందుకు ఆగ్రహించాడో, అమాయక ప్రజలను అకారణంగా ఎందుకు దండించాడో తెలియదు.

కాని, ఇలాటి క్లిష్ట సమయాలలోనే నిత్యసత్యాలు పునర్నిరూపితం అవుతాయి. అగ్గిలో పడితే గాని అపరంజి ఏదో తెలియదు కదా! "మనస్వీకార్యార్థ న గణయాతి దుఖం న చ సుఖం" – అన్న భర్తృహరి సూక్తి మరొకమారు దేశమంతటా మారుమ్రోగింది. ఆ సూక్తికి మానవతా రూపమే శ్రీ మండలి వెంకట కృష్ణారావు.

శ్రీ మండలి, తుఫాను సంభవించిన నాడు కాకతాళీయంగా అవనిగడ్డలో ఉన్నారు. అప్పుడాయన చేసిన సేవ సువర్ణాక్షరాలతో లిఖించదగినది. ఆయనలోని మానవత్వం వేయి మత్తగజాల బలంతో ఉప్పెన కన్నా ఉవ్వెత్తున లేచింది. గంటకు రెండు వందల కిలోమీటర్ల వేగంతో వీచే పెను గాలులలోను ఆయన హిందీ విద్యాలయంలోని పిల్లలేమయ్యారో! సేవాశ్రమము, అనాథ శరణాలయం పరిస్థితి యేమిటో! – అని విలపిస్తూ పరుగెత్తారు, వారిని దక్కించుకొందామని. తెల్లవారింది. ఉప్పెన రాక్షసి ఎందరో ప్రజలను, ఎన్నో పశువులను సమూలంగా మింగిందని వార్తలు వ్యాపించాయి. ఒంటిమీద గుడ్డలున్నాయా, లేదా అన్నది కూడా పట్టించుకోకుండా బయలుదేరారు. పాదచారియై. కూలిపోయిన ఇండ్ల మధ్యన నడిచారు. జలప్రళయంలో మరుగయిపోయినవారు పోగా, మిగిలిన వారి మనసులలో బలం నింపడానికి నడిచారు. ప్రజల హృదయాలలోనే నడిచారంటే సరిపోతుంది, ఒక్కమాటలో.

అంతటితో ఆగలేదు ఆయన. కనీవినీ ఎరుగని ఈ ఘోర కలి ప్రభుత్వానికి తెలియాలి. ప్రభుత్వం సహాయ కార్యక్రమం వెంటనే ప్రారంభించాలి. త్వరగా చేరడానికి తగిన వాహనము లేదు.

అతి కష్టం మీద వారు విజయవాడకు వెళ్ళారు. హుటాహుటిగా ప్రభుత్వ యంత్రాంగాన్నికదిలించారు. కాలిలో దాదాపు 36 ముళ్ళు గుచ్చుకున్నాయి. ఐనా, లక్ష్య పెట్టలేదు. కాలికి కట్టు కట్టించుకున్నారు. నడక ప్రారంభించారు. విరామమెరుగని నడక. పల్లె పల్లెకు తిరిగారు. పరిస్థితి చూచారు, పరితపించారు, పరితాపం పోగొట్టారు, చొరరాని ప్రాంతాలను హెలికాప్టర్ ద్వారా పరిశీలించారు.

ఈ సమాశ్వాసన యాత్రలో, ఈ సహాయ సేవా యాత్రలో ఆయన చూడని పల్లె లేదు. ఆయన మాట్లాడని మనిషి లేడు. ఆయన ఎన్నికల ప్రచారోద్యమంలో ఎన్నోమార్లు గ్రామాలు తిరిగారు. ఆ పర్యటనల పద్ధతి వేరు, ఉద్దేశం వేరు. ఈ యాత్ర అట్టిది కాదు. విషాదయాత్ర, పరామర్శ యాత్ర, పునరుజ్జీవయాత్ర. ఇలా తుఫానుకు గురి అయిన ప్రాంతాన్నంతా కాలికి బలపం కట్టుకొని తిరిగారన్న సామెతగా పలుమారు తిరిగారు. ప్రజలలో విశ్వాసాన్ని నింపారు. విషాద యోగం వలదన్నారు. ఇప్పుడు కావలసింది పునరుజ్జీవ పునర్నిర్మాణాలని ఉత్సాహపరిచారు. తత్ క్షణమే చేయదగిన సహాయం, సహకారం చేశారు, చేయించారు.

అవనిగడ్డలో తుఫాను బాధితుల శిబిరమైంది ఆయన మకాం. వేలకొలది తుఫాను బాధితులు ఆహమిహకతో ఆత్రంగా, ఆశతో తోసుకొని వచ్చారు శిబిరానికి. తుఫాను బాధితులకు సహాయపడుదామని వచ్చే ప్రతివారికీ ఆ శిబిరమొక పర్యాటక కేంద్రమయింది. యాత్రాస్థలమయింది. శ్రీ మండలి నిర్విరామ కృషి వల్ల వందలకొలది స్వచ్ఛంద సేవా సంస్థలు ఉరుకులు పరుగులతో వచ్చాయి. ఆహారం, వస్త్రాలు అపారంగా అందజేశాయి. ఆయన చిత్తశుద్ధిని, అక్కడి హృదయవిదారక పరిస్థితిని చూచిన వందలకొలది సేవాసంఘాలు చురుకుగా పని ప్రారంభించాయి. ఎటు చూచినా కనిపిస్తూ, ఎవరిని చూచినా పలుకరిస్తూ, ఏమి కోరినా అందజేస్తూ పరమాణువులోని పరమ సూక్ష్మాంశం లాగా తిరుగుతున్న శ్రీ మండలి – సేవోత్సాహాలు మూర్తీభవించిన శ్రీ మండలి ఆ సేవా సంఘాలకు రెట్టింపు, మూడు రెట్లు ఉత్సాహవేశాలు పోశారు. ఎక్కడ చూచినా, ఇందుగలడందు లేడనే సూక్తి లాగ ఆయనే కనిపిస్తూ సేవ చేశారు. ఆయన వ్యక్తిత్వం అలాంటిది. కనుకనే రాష్ట్రపతి మొదలు నడివీధిలో నడిచే మనిషి వరకు, దేశంలోని సంఘ సేవాసంస్థలు మొదలు అంతర్జాతీయ సంస్థల వరకు, స్థానిక పత్రికలు మొదలు అంతర్జాతీయ పత్రికల వరకు ఆయన సేవానిరతి ప్రశంసలే. 1977 నవంబరు 19 తుఫాను బాధితులను ఒక కంట కనిపెడుతూ, వారి బాగోగులు చూస్తూనే ఉన్నారు.

ఆ సేవాతత్పరత, చిత్తశుద్ధి శ్రీ మండలి అంతర్జాతీయ ఖ్యాతిని పెంపొందించాయి. 1977 సంవత్సరపు మానవతామూర్తిగా ఆయన కీర్తితులయ్యారు. మత ప్రచారకులు, సర్వోదయ కార్యకర్తలు, సంఘ సేవాపరాయణులు - అంతెందుకు, తుఫాను భీభత్సం తెలిసిన ప్రతివ్యక్తి మత, వర్గ, కుల, రాజకీయ సిద్ధాంతాల భేదం లేకుండా ఆయనను ప్రశంసించారు. ఆయన బద్ధ శత్రువులు గూడా ఆయనను కొనియాడక తప్పలేదు. మాసిన గడ్డంతో, బెదురూ చూపులతోను, మూర్తీభవించిన విషాదంలాగా ఉన్న ఆయన బొమ్మను దేశవిదేశాలలో దూరదర్శినిలో చూచిన వారికి ఉప్పెన వల్ల ఉప్పతిల్లిన ఘోర నష్టం నిజంగా ఎంతో ఆయన మాటల వల్ల, వివరణల వల్ల తెలిసింది. క్షణంలో ఎంతటి మానవ సమూహం మడిసిందో తెలిసింది. ఉపకార చింత గల వారికి, సంఘ సేవాసంస్థలకు సహాయ బుద్ధి సహజంగానే కలిగింది. దేశవిదేశాలలోని సంస్థలు ఆయనకు బాసటగా నిలిచాయి. నేడు దివిసీమలో పెక్కు సంస్థలు, వ్యక్తులు నిరాశ్రయులైన ప్రజలకు ఆశ్రయాలు కల్పించాయంటే, తక్కిన సహాయ కార్యక్రమాలు జరిపి సేవ చేయ గలిగాయంటే, ఇదంతా శ్రీ మండలి కృషి ఫలితమేనని, ఇతరుల సానుభూతి సహాయాలను పొందటానికి ఆయన పడిన పాట్లేనని ప్రతివారు గ్రహించగలరు. దివిసీమకు వెళ్ళిన ప్రతివారు, దేశీయులైనా, విదేశీయులైనా ఆయనను చూచి, ఆయన ద్వారా తమ సేవలు వెల్లడించుకోవాలని ఉవ్విళ్ళూరారు. అలా అయితే, తమ సహాయం సక్రమంగా, సరిగా, సకాలానికి ప్రజలకు అందగలదని వారు విశ్వసించారు, ఆ విశ్వాసం నెలకొల్పుకున్నారు శ్రీ మండలి.

పూర్వం కాటయవేముడు ఆది వరాహమూర్తి వలె దివిసీమను ఉద్ధరించినట్లు చెబుతున్నది. ఈనాడు శ్రీ మండలి తుఫాను సమయంలో మేరునగ దీరుడుగా నిలిచి ప్రజలను ఆదుకున్నారు. సేవాశ్రమంలో తుఫాను గాలికి కొట్టుకొని పోతున్న పిల్లలను రక్షించారు. బాధితులకు సహాయ కార్యక్రమాలు నిర్వహించారు. గ్రామాలలో పక్కా ఇండ్లు నిర్మించే పథకం అమలు పరచడంలో అలసట ఎరుగక పాటుపడ్డారు. ఆయన ఉత్సాహ ప్రోత్సాహాలు స్వచ్ఛంద సేవా సంస్థలు దివిసీమలో కృషి చేయడానికి, విజయవంతంగా పనిని నిర్వహించడానికి పాథేయాలయ్యాయి.

శ్రీ మండలి ధైర్యసాహసాలు పెనవేసుకున్న రాజనీతిజ్ఞుడు. సోషలిజానికి అంకితుడైన సిద్ధాంతవాది. ఉపజ్ఞ గల వ్యవస్థాపకుడు. విశ్రాంతి యెట్టిదో తెలియని కార్యకర్త. ఒక్క మాటలో ప్రజల మనిషి, మానవాతామూర్తి. నిరాడంబరత, సర్వ సులభత ఆయనకు గాంధీ మార్గం వల్ల అబ్బిన గుణాలు. బీద బిక్కి, శత్రువు, మిత్రుడు ఆయనను ఎప్పుడుబడితే అప్పుడు, ఎక్కడబడితే అక్కడ చూడవచ్చు, చెప్పవచ్చు, వినవచ్చు, తగిన మేలు పొందవచ్చు. నిజజీవిత విషయంలోను, సంఘ, ప్రభుత్వ విషయాలలోను ఆయన

పూర్తిగా గాంధీ తత్వవాది. మనసా వాచా కర్మణా గాంధీ తత్వవాది.

గాంధీజీ ప్రబోధాలు పత్రికలో పఠించి బెజవాడలోను, బొంబాయిలోను గాంధీని దర్శించి ఉత్తేజితులై కార్యరంగంలో దూకారు. విధానసభ సభ్యులుగా, లోక్ సభ సభ్యులుగా, మంత్రిగా చిరస్మరణీయ సేవ చేశారు. విద్యా మంత్రిగా ఉన్నప్పుడు చేసిన సేవ ఆయనకు చిర కీర్తి సంపాదించింది. ప్రపంచ తెలుగు మహాసభను అత్యద్భుతంగా నిర్వహించారు. కార్యనిర్వాహకా దక్షులుగా రాత్రింబవళ్ళు పనిచేసి తెలుహుజాతి చరిత్రలో అదొక మహత్తర సంఘటనగా ముద్ర వేశారు. మాటల కన్నా చేతలకే ప్రాధాన్యమిచ్చే గాంధీ సిద్ధాంత విశ్వాసి గనుక గాంధీజీ శతజయంతి నాడు అవనిగడ్డలో గాంధీక్షేత్ర నిర్మాణము ప్రారంభించి దానిని మహాసంస్థగా రూపొందించారు. ఉప్పెనలో సర్వస్వమూ కోల్పోయిన 400 మంది పిల్లలకు గాంధీక్షేత్రంలోని సేవాశ్రమంలో ఆశ్రయం కల్పించారు. వారికి ఉపాధి కల్పన, కుట్టు మిషన్ సెంటర్, బట్టల కట్టింగు ట్రయినింగు, స్త్రీ సంక్షిప్త విద్యా కేంద్రము, ఆశ్రమ పాఠశాల, గాంధీ గురుకులం, హిందీ ప్రచారక విద్యాలయము, మహావిద్యాలయం మున్నగు అనేక సంస్థలు నెలకొల్పారు. 80 వయోజన పాఠశాలలు స్థాపించారు. సర్వోదయ కార్యకర్తల, సంఘసేవకుల సభలు జరిపారు. దక్షిణ భారత నిర్మాణ కార్యకర్తల మహాసభలు నిర్వహించి గాంధీక్షేత్ర విశిష్టతను భారతదేశ వ్యాప్తం చేశారు. ఆంధ్రప్రదేశ్ స్వచ్ఛంద సంస్థల సంఘసేవకుల మహాసభలు జరిపి రాష్ట్రస్థాయి సంస్థను స్థాపించి స్వచ్ఛంద సేవలో సమన్వయ కృషికి తోడ్పడ్డారు. ప్రపంచ హిందీ మహాసభ సందర్భంగా భారత ప్రతినిధిగా మారిషస్ కు వెళ్లి అక్కడి ప్రధాని శ్రీ రాం గులాంను కలుసుకొని, మారిషస్ తెలుగు వారికి, ఆంధ్రప్రదేశ్ కు సదవగాహన కల్పించారు. రాష్ట్ర సమైక్యానికి పెట్టని కోటగా నిలబడ్డారు.

దేశ పురోభివృద్ధి స్వచ్ఛంద సేవకుల మీదే ఆధారపడి ఉందని శ్రీ మండలి విశ్వాసం. ఆ విశ్వాసానికి కార్యరూపం ఇస్తున్న ఆదర్శ సంఘసేవకుడు ఆయన. ఇలాటి శ్రీ మండలిని ఉత్తమ సంఘసేవకునిగా నిర్ణయించి ప్రభాకర్ జీ మెమోరియల్ అవార్డుతో సన్మానిస్తున్నందుకు ఆంధ్రప్రదేశ్ స్వచ్ఛంద సంస్థల, సమాజ సేవకుల సంఘాన్ని ప్రశంసిస్తున్నాను. శ్రీ మండలి వెంకట కృష్ణారావును హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

*(ప్రభాకర్ జీ అవార్డు - ఉత్తమ సమాజ సేవకుడు - 1978 అభినందన సంచిక)*

# హైదరాబాద్ నోట్‌బుక్

*(హైదరాబాద్ నోట్‌బుక్, ఆంధ్ర సచిత్ర వారపత్రికలో శ్రీ మండలి గురించి శ్రీ తిరుమల రామచంద్ర వ్రాసిన వార్తాంశాలు)*

**ప్రపంచ తెలుగు మహాసభలు:**

ప్రపంచంలోని తెలుగు వారిని ఒక వేదిక మీదకి తెచ్చి, వారిలో భావ సమైక్యాన్ని కలిగించి వారి పరస్పర సౌహార్ద సామరస్య భావాలను పెంపొందింప చేయాలనే సత్సంకల్పంతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ముఖ్యంగా డాక్టర్ గోపాలరెడ్డి అన్నట్లు కృష్ణార్జునులు, నరనారాయణలు వంటి ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు, విద్యామంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు తలపెట్టిన ప్రపంచ తెలుగు మహాసభలు జంటనగరాలలో అపూర్వమైన, అనిదంపూర్వమైన ఉత్సాహాతిరేకాన్ని కలిగించి, శాశ్వత స్నేహ ముద్రను గంభీరంగా, గాఢంగా వేశాయని చెప్పడంలో అతిశయోక్తి ఉండదు. రాక్షస ఉగాది నుంచి వారం రోజుల పాటు తెలుగు కళలు, తెలుగు చరిత్ర, తెలుగు భాష, తెలుగు సంస్కృతి వేయి విధాలుగా సాకారమై జంట నగరాల పౌరుల ఎదుట ప్రత్యక్షమై వారి మనసును, హృదయాన్ని, బుద్ధిని ఆనందతుదిలం చేశాయి. జనం నేల ఈనినట్లు ఆకాశం నుంచి ఊడిపడినట్లు మహా వాహినిగా వచ్చి గోష్టులలో పాల్గొన్నారు. మహాసభలను అలంకరించారు. సాంస్కృతికోత్సవాలను తిలకించారు.

నగరం నట్టనడుమున ఉన్న లాల్ బహదూర్ స్టేడియం కాకతీయనగర్ గా మారింది. దానికి ఇరువైపులా రెండు కాకతీయ ద్వార తోరణాలు నిర్మించబడినాయి. ఇవికాక సాంస్కృతిక కార్యక్రమమూ మహాసభలు జరిగిన ప్రాంతంలో ప్రవేశించడానికి ఏడు ద్వారాలు పెట్టబడ్డాయి. వాటికి నన్నయ ద్వారం, పోతన ద్వారం, కవయిత్రి మొల్ల ద్వారం, వేమన ద్వారం, భక్త రామదాస ద్వారం, సరోజినీనాయుడు ద్వారం అని పేర్లు పెట్టారు. గ్యాలరీలలో కూర్చున్న వారికి రంగస్థలం మీది నృత్య, నాటక ప్రదర్శనలు స్పష్టంగా కనిపించడానికి 77 టెలివిజన్ సెట్లు అమర్చడం ఎంతో మేలయింది. ప్రేక్షకులు నిశ్చింతగా తెల్లవార్లూ నృత్య, నాటకాదులు తిలకించి తరించారు. కాకతీయనగర్ కు వెళ్ళే అన్ని మార్గాలలోనూ సుందరమైన తోరణాలు నిర్మించారు. స్టేడియం లోపల 47 మంది ఆంధ్ర ప్రముఖుల కటవుట్ చిత్రాలు జనాన్ని గొప్పగా ఆకర్షించాయి.

ఫతే మైదానంలో స్టేడియం వెనుకన ఉన్న బయలులో గోష్టులు, సదస్సుల నిమిత్తం పెద్ద షామియానా వేయబడింది. దీనికి నాగార్జున పీఠం అని నామకరణం చేశారు. ఎగ్జిబిషన్ గ్రౌండ్స్ లో ఏర్పాటు చేయబడిన "తరతరాల తెలుగుజాతి వైభవం" ప్రదర్శనం

గొప్ప ఆకర్షణ. దీనిలో తెలుగుదేశం లోని ప్రముఖ చిత్రకారులు, శిల్పులు పాల్గొన్నారు. దీనిని మనోహరంగా రూపొందించారు. సాంస్కృతిక కార్యకలాపాలలో 1300 మంది కళాకారులు పాల్గొన్నారు. చలనచిత్రోత్సవం జరిగింది. దీనిని ఏప్రిల్ 11వ తేదీన ప్రఖ్యాత దర్శకుడు శ్రీ బి.ఎన్. రెడ్డి ప్రారంభించారు. లిబర్టీ, స్కై లాండ్ థియేటర్లలో మహాసభ ప్రతినిధులకు తెలుగు చిత్రాలు చూపబడినాయి.

12వ తేదీ ఉదయం కాకతీయనగర్‌లో ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు పతాకావిష్కరణ జరిపిన పిదప ప్రత్యేక తపాలా బిళ్ళను పోస్ట్ మాస్టర్ జనరల్ శ్రీ పి.ఎస్. రాఘవాచారి స్వాగత వచనాల తర్వాత ముఖ్యమంత్రి విడుదల చేశారు. ఎగ్జిబిషన్ గ్రౌండ్స్‌లో తరతరాల తెలుగుజాతి వైభవం ప్రదర్శనాన్ని కేంద్ర దేశీయాంగ మంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి ప్రారంభోత్సవం జరపవలసింది కాని ఆయన రాలేక పోయినందున ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు లాంఛనంగా ప్రారంభించారు. ఈ సందర్భంగా చిత్రకారులకు సన్మానం చేయడం జరిగింది.

12వ తేదీ సాయంకాలం ఇదివరకు జంటనగరాలు కనివినీ ఎరుగని బ్రహ్మాండమైన ఊరేగింపు చార్ మినార్ నుంచి బయలుదేరి కాకతీయనగర్ చేరింది. ఊరేగింపు తర్వాత ఉప రాష్ట్రపతి శ్రీ బి.డి. జెట్టి మహాసభను ప్రారంభిస్తూ, సాంప్రదాయ శృంఖలాలలో జడప్రాయమైన సమాజాన్ని చైతన్యవంతం చేసి ముందుకు నడిపించడం తెలుగు రచయితల కర్తవ్యమని, ప్రపంచంలోని తెలుగువారి సమైక్యం భారత సమైక్యాన్ని పటిష్టం చేస్తుందని అన్నారు. ఆయన తనకు తెలుగు అర్థమవుతుందని చెబుతూ, తెలుగు ప్రసంగం వ్రాసుకొని వచ్చి చదివారు. అధ్యక్షత వహించిన శ్రీ వెంగళరావు తేనె లొలుకు తెలుగు భాషకు సముచిత స్థానం కల్పించడానికి రాష్ట్ర ప్రభుత్వం కృత నిశ్చయంతో ఉందన్నారు.

ఈ మహాసభల సందర్భంగా ప్రచురించిన 56 గ్రంథాలను శ్రీ దేవులపల్లి రామానుజరావు సమర్పించగా, డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి ఆవిష్కరిస్తూ, దేశదేశాల నుంచి వచ్చిన వారికి వాటిని సమర్పిస్తున్నామన్నారు. "ఇక్కడ లక్షలాది జనం నేడు సమావేశం కావడం తెలుగు తల్లిని ఆరాధించడం కోసం, అభిషేకం చేసి అనియడం కోసం తమ హృదయాలను అర్పించడం కోసం" అని తన్మయత్వంతో అంటూ, ప్రసంగ చాతురీలో ఇతరులను మించి పోయారు. ప్రత్యేక సంచికను శ్రీ వి.పి. రాఘవాచారి సమర్పించగా ఉత్తరప్రదేశ్ గవర్నర్ డాక్టర్ చెన్నారెడ్డి ఆవిష్కరిస్తూ, తెలుగు ప్రజల భావసమైక్యం శాశ్వతం కావడానికి చర్యలు తీసుకోవాలన్నారు. మహాసభలకు వచ్చిన దాదాపు 80 మంది విదేశీయ తెలుగు ప్రతినిధులు పక్షాన మాట్లాడిన వారిలో శ్రీలంక ప్రర్తినిది శ్రీమతి మీనాక్షి పొన్నుదొరై శ్రోతలను విశేషంగా ఆకర్షించారు. ఆమె తన

హృదయాన్ని శ్రోతల ఎదుట కుమ్మరించారానిపించింది. మహాసభలు కుమారి టంగుటూరి సూర్యకుమారి పాడిన "మా తెలుగు తల్లికి మల్లెపూదండ" వాటితో ప్రారంభం కావడం, ఈ పాట వ్రాసిన శ్రీ శంకరం బండి సుందరాచారిని ప్రభుత్వం సన్మానించడం ప్రశంసనీయ విషయాలు.

వివిధ రంగాలలో ప్రముఖలయిన దాదాపు 200 మందిని ప్రభుత్వం వారం రోజుల పాటు శాలువ, ప్రత్యేక ఫలకం, బ్రీఫ్ కేసులతో సత్కరించడం ఉత్సవాల ప్రత్యేకత.

ఉదయం గోష్టులు, సాయంకాలం సాంస్కృతిక కార్యక్రమాలు జరిగాయి. 16వ తేదీన మాజీ రాష్ట్రపతి డాక్టర్ రాధాకృష్ణన్, మాజీ గవర్నర్ శ్రీ ఖండూభాయి దేశాయి అస్తమించడం వల్ల 17వ తేదీ జరుగవలసిన కార్యక్రమమంతా 18వ తేదీలో కలిపి వేయడం వల్ల జనం తొక్కిడి ఎక్కువైంది. 17వ తేదీ మహాసభ అస్తమించిన ఇరువురికీ శ్రద్ధాంజలి ఘటించింది.

18వ తేదీన సమాప్త్యుత్సవంలో రాష్ట్రపతి శ్రీ ఫక్రుద్దీన్ అలీ అహమద్ ప్రసంగిస్తూ, ప్రజల హృదయాలలో ఉదాత్త భావ స్ఫూర్తిని సృష్టించడమే సాహిత్య పరమావధి అన్నారు. రాష్ట్ర మంత్రి శ్రీ కె.వి. కేశవులు కృతజ్ఞతతో జనగణమన గానంతో మహా సభోత్సవాలు సమాప్తమైనవి. కాని అది ప్రారంభించిన సమైక్య భావతరంగాలు మాత్రం నిరంతరం అనురణిస్తూ, తెలుగు వారి హృదయాలలో ప్రతిధ్వనిస్తూ, హృదయ స్పందనతో పాటు స్పందిస్తూ ఉంటాయి.

(తేదీ: 16-5-1975)

**శ్రీ మండలి:**

విద్యాశాఖామాత్యులు శ్రీ మండలి వెంకట కృష్ణారావు గురించి నా మిత్రుడు, సహ పత్రికా రచయిత వేమూరి వెంకట నరసింహారావు చెబుతుండగా తరచూ వింటున్నాను. ఇటీవల నాలుగు సంవత్సరాలుగా చూస్తున్నాను. చూస్తున్న కొద్దీ ఆశ్చర్యం కలుగుతూ ఉంటుంది. ఈ వ్యక్తిలో ఇంతటి క్రియాశీలత్వం, చైతన్యోద్గారం ఎక్కడి నుంచి పుట్టుకొస్తున్నాయా అని, అలసట అనేది లేదా అని! అవును! గాంధీతత్వం జీర్ణించిన తండ్రి శ్రీ వెంకట్రామయ్యగారి శిక్షణ, నిరంతర కార్యశీలి అయిన తల్లి శ్రీమతి మహంకాళమ్మ వాత్సాల్యామృతం ప్రసరించినప్పుడు ఫలితం అన్యథాగా ఎలా ఉంటుంది? అని సరిపెట్టుకున్నాను. పదవి కోసం తాపత్రయపడక, నిరంతర ప్రజాసేవా దీక్షతో, ఉన్నదానిలో మూడు వంతులు హరిజనులకు పంచిపెట్టిన త్యాగనిరతిలో, క్విట్ ఇండియా ఉద్యమంలో అజ్ఞాతవాసంలో కార్యకలాపాలు కొనసాగించిన పరాక్రమంతో కృష్ణాజిల్లా యువజన కాంగ్రెసు అధ్యక్షుడై యువకులను నడిపించిన కీర్తితో, నిర్మాణ క్రియా దక్షుడై

ఆదర్శప్రాయంగా "గాంధీక్షేత్రాన్ని" దున్నించిన కౌశలంతో, రాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శిగా పొందిన రాణతో, సంఘ సేవా మంత్రిగా, సమైక్య సాధకుడుగా, విద్యామంత్రిగా అందుకున్న ప్రశంసలతో అన్నిటినీ మించి ప్రపంచ తెలుగు మహాసభలను అపూర్వంగా నిర్వహించి తెలుగువారి హృదయకేదారాలలో పూయించిన సౌభ్రాత్ర సుమాల సౌరభంతో ప్రజల మనిషే అయిన మండలిని ఎంత దండిగా పొగడినా మెండనిపించదని ప్రతి తెలుగువాడూ ఒప్పుకుంటాడు. తెల్లవారి సూర్యునికి ముందే పంచ పవన ఉషః కాలంలోలేచి, భగవంతుని, గాంధీ మహాత్ముని స్మరించి నిత్యకృత్యాలు, ప్రజావిధులు ప్రారంభించి, విరామం, విసుగు లేక అర్ధరాత్రి వరకు పనిచేసి, భగవంతుని స్మరించి నిద్రపోతూ, జీవితంలోనూ, సమాజ దృక్పథంలోనూ, ప్రభుత్వ పాలనలోనూ గాంధేయ సిద్ధాంతాలకు అత్యంత ప్రాధాన్య మిచ్చి, వాటిని ఆచరణలో పెడుతున్న మండలి ఆగస్టు 4వ తేదీకి అర్ధ శతాబ్ద వయస్సులో ప్రవేశించారంటే నాకు నమ్మకమే కలుగడం లేదు. నవనవోత్సాహం నిత్య నూతనంగా పొంగులు వారే అలనాటి యువజన నాయకులుగానే కాన వస్తారు. నేల నాలుగు చెరగులా ఉన్న తెలుగువారిని ఒక్క వేదికపై సమావేశపరచడానికి ప్రయత్నించి కృతకృత్యులైన మండలి యావదాంధ్రవళి ప్రేమ గౌరవాలు చూరగొన్న మండలి, విద్యార్థులు స్వయంకృషితో జ్ఞానార్జన చేసి, అరత సంపాదించుకొవాలే గాని, అవినీతికి పాల్పడితే జీవితమంతా అవినీతి కలుషితమవుతుందని, వారికి నచ్చచెప్పి సవ్యమార్గాన నడిపించిన విద్యార్థి నాయకుడు మండలి కనీసం మరి ఏబదేండ్లు ఈ ఉత్సాహాతిశయంతోనే, ఈ నవ చైతన్యంతోనే, ఈ కార్యపటుత్వంతోనే ప్రజాసేవలో మనుగడ సాగించాలని నేను హృదయపూర్వకంగా, తక్కిన ఆంధ్రావళితో పాటు ఆకాంక్షిస్తున్నాను.

(తేదీ:15-8-75)

**మారిషస్ ఆంధ్రులు - మండలి :**

"మారిషస్ తెలుగువారిది ఒకే కులం. అది తెలుగు కులం. భాష ఇంత గొప్ప సమైక్యం కలిగించే విడరాని బంధమంటే ఎవరికైనా ఆనందాశ్చర్యాలు కలుగుతాయి. మూడు తరాల క్రితం తెలుగుదేశం నుంచి మారిపస్‌కు వెళ్ళిన తెలుగువారు తమ భాషను, సంస్కృతిని నేటివరకు కాపాడుకుంటూ రావడం, అందులోను ఫ్రెంచి, ఇంగ్లీషు, క్రియోల్, హిందీ, తమిళాల మధ్య తెలుగూ ప్రమలంగ వుండడం ప్రశంసా పాత్రమైన విషయాలు అన్నారు విద్యాశాఖామాత్యులు శ్రీ మండలి వెంకట కృష్ణారావు నాతో. ఆయన ఆగస్టు చివరన మారిషస్‌లో జరిగిన ద్వితీయ ప్రపంచ హిందీ మహాసభలకు ప్రతినిధిగా వెళ్ళి తిరిగి వచ్చారు. మారిషస్‌లో 50 వేలనుంది తెలుగు వారున్నారు. వీరిలో చాలామంది తూర్పు గోదావరి జిల్లా యానాం నుండి వెళ్ళినవారు. నేను అక్కడున్న

నాలుగు రోజుల్లోను 1160 కిలో మీటర్లు తిరిగి 40 గ్రామాలు చూచాను. తెలుగువారిని కలుసుకున్నాను. నాలుగు వేల మైళ్ళ దూరంలో ఉన్నా, వంద సంవత్సరాలకు పైగా గడచినా వారు తెలుగు చక్కగా మాట్లాడగలుగుతున్నారు. ఆంధ్ర మహాసభ బాగా పని చేస్తున్నది. దానికి 60 శాఖలున్నాయి. దాదాపు అన్ని శాఖలకు స్వంత భవనాలున్నాయి. 60 తెలుగు పాఠశాలలున్నాయి. 110 మంది తెలుగు ఉపాధ్యాయులున్నారు. వారిలో స్వాతంత్ర్యానంతరం తమ భాషా సంస్కృతుల పట్ల చైతన్యం కలిగింది. గనుక ఇక అవి లుప్తమై పోయే ప్రమాదం లేదు. వారు తెలుగు పుస్తకాల కోసం తహతహలాడుతున్నారు. వారికి మనం ముఖ్యంగా పంపవలసినవి తెలుగు పుస్తకాలు, పాటలు, హరికథలు మున్నగు వాటి టేపు రికార్డులు తెలుగు ఫిలిములు అని శ్రీ మండలి తెలిపారు. మా తాత ముత్తాతల దేశం నుంచి వచ్చావు నాయనా, మా ఇంటికి రా అంటూ ఒక 80 ఏళ్ళ ఆమె ఆయనను తమ ఇంటికి తీసుకువెళ్ళిందట. "మా తెలుగును, తెలును వారిని ఎత్తనానికి (ఉద్ధరించడం కోసం) వచ్చారు రావుగారు అని మరికొందరు మహిళలు అన్నారట. అక్కడి ప్రధానమైన పంట చెరకు. గంటకు 25 టన్నుల చెరకును క్రష్ చేసే కర్మాగారం వుంది. ఇది. ప్రపంచంలోనే రెండవదట. తెలుగు వారికి రాజకీయంగా తగినంత బలం లేదు. ఇప్పుడిప్పుడే కలుగుతున్నది. నేను వెళ్ళి తెలుగు ప్రముఖులను, ప్రభుత్వ నాయకులను కలిసాను. నేను తీసుకువెళ్ళిన పుస్తకాలను, టేప్ రికార్డులను వారికి భారత హై కమిషనర్ సమక్షంలో బహూకరించాను. వారికి పెళ్ళిళ్ళు చేయించడానికి, సంస్కృత గురించి తెలియజేయడానికి పురోహితులు కావాలి. ఒక నేడ విద్వాంసుని పంవుతున్నాము అన్నారు శ్రీ మండలి. అక్కడి జీతాలు, జీవన వ్యయప్రమాణము ఎక్కువ. సగటు ఆయుస్సు ప్రమాణం 70 సంవత్సరాలు. ఇతర భావలు ఎన్నో చేర్చుకుంటూ, వారు తమ భాషా సంస్కృతులు నిలబెట్టుకోవాలి. గనుక వారికి మనం సౌజన్యంతో తోడ్పడాలని శ్రీ మండలి కోరారు. ఈ విషయాలనే సెప్టెంబర్ 1వ తేదీన ద్వారకా హోటలులో జరిగిన సన్మాన సభలోను తెలిపారు.

(తేదీ: 8-10-1976)

**మానవతా మూర్తి మండలి:**

హేమ్నకి సంలక్ష తే హ్యగ్నౌ విశుద్ధిః శ్యామికా సినా - నిప్పులో పడితేగాని బంగారు నిగ్గు తేలదు అన్నాడు కాళిదాసు. మోచేతుల కిందకీ, మోకాళ్ళ మీదకీ వ్రేలాడే ఖద్దరు చొక్కా వట్టి బూటకం అన్నారు. పూల దండలు వద్దు, పళ్ళు ఇవ్వండి అని సలహా ఇస్తే, ఏదో కొత్త సూచన చేసి సంప్రదాయాన్ని కాదని సూక్ష్మంలో గొప్పవాడు కావాలని ఎత్తు అన్నారు. రాష్ట్రంలో విచ్చిన్నకర శక్తులు చెలరేగి నప్పుడు తెలుగుజాతి ఒక్కటే

నిద్రపోవడానికి వీలు లేదని ఎలుగెత్తి చాటితే ముఖ్యమంత్రి కావడానికి మరొక పన్నాగమన్నారు. ఊరికి రానివ్వమన్నారు. ప్రపంచం నాలుగుచెరుగుల చెల్లాచెదురుగా ఉన్న తెలుగువారి భావసమైక్యానికి ప్రపంచ తెలుగు మహాసభలు ఏర్పాటు చేస్తే అబ్బో! అంతర్జాతీయ ఖ్యాతికి అంగలార్పు అని ముక్కు మూతి విరిచారు. అయినా శ్రీ మండలి వెంకట కృష్ణారావు మేరునగంగా నిలబడ్డారు. ఆయనలో మానవతామూర్తి తుఫానులో బయటపడింది. తుఫాను తాడికి తునాతునకలయిన తన దివిసీమను చూచి మండలి గుండెలు అవిసిపోయాయి. మృతుల అంత్య సంస్కారానికి మృత శేషుల భతవ్యానిష్కానికి నడుం కట్టారు. రెచ్చగొట్టడం కాదు కావాల్సింది, వెచ్చని కన్నీరు కార్చడం అని నిరూపించారు. శవానికి సంస్కారం చేయడమే శివునికి ప్రీతి అని చాటారు. అలాటి వారిది ఏ పార్టీ కాదు, మానవతా పార్టీ.

(తేదీ:30-12-77)

**మలేషియా మహాసభలు:**

ఇల్లు కట్టిచూడు, పెళ్ళిచేసి చూడు-అన్నది పాత సామెత. సభ నిర్వహించి చూడు-అనేదికూడా ఆ సామెతకు చేర్చాలి. ఏప్రిల్ 14 నుంచి 18వరకు ఐదు రోజులపాటు మలేషియా రాజధాని కౌలాలంపూర్‌లో జరిగిన ద్వితీయ ప్రపంచ తెలుగు మహా సభలను దీనికి ఉదాహరణగా పేర్కొనవచ్చు. మలేషియా సుందర సంపన్న దేశం. చాలా పెద్ద హోటళ్ళు, హోటల్ బయపురిలోను, మరికొన్ని హోటళ్ళలోను ప్రధాన సమావేశాలు, ప్రతినిధులను విడిది ఏర్పాటు చేశారు. కాని మలేషియా ఆంధ్ర సంఘం మొదటే ప్రతినిధులు పరిమితంగా వస్తే వసతి కల్పించగలమని పదేపదే ప్రకటించినా ప్రతినిధుల సంఖ్య దాదాపు వేయి కావడం వల్ల వసతి కల్పించలేక ఆంచెలంచెలుగా ప్రతినిధులను కౌలాలంపూర్‌కు పంపడం, వారు కూడా వెంటనే తగిన వసతి లేక, విమానాశ్రయంలోను, ఒక హోటల్ ముందు ఆరు బయట పడుకోడం, ప్రాత దశనానికి ప్రతినిధులకు ఇవ్వవలసిన చెరి మూడున్నర మలేషియా డాలర్ల మొత్తం ఇవ్వకపోవడం, విహార యాత్రకు ఏర్పాటయిన బస్సులు అందరికీ అందుబాటులో లేకపోవడం, ట్రావెల్ ఏజెంట్లు, తక్కినవారు ప్రతినిధులను తరతమ భావంతో చూడడం వంటి అనాహూతాలు జరిగినా మొత్తంమీద మహాసభలు విజయవంతంగా జరిగాయనే చెప్పవచ్చు. మలేషియా తెలుగు వారు-వంద సంవత్సరాలకు పైగా తమ భాషా సంస్కృతులను కాపాడుకొంటున్న మలేషియా తెలుగు వారు స్వదేశాన్ని దర్శించి తపించినంత పరమానందం పొందారు. ఈ సభలకు వచ్చిన వారిని చూచి, వారి ప్రసంగాలు పరిశోధన పత్రాలు విని, 14వ తేదీన ప్రారంభోత్సవం డాక్టర్ బాలమురళీకృష్ణ ప్రార్థనతో ఆంధ్రప్రదేశ్ ముఖ్య మంత్రి శ్రీ

టి. అంజయ్య జరిపారు. మలేషియా ఉప ప్రధాని డాక్టర్ మహదీర్ మహమ్మద్ విచ్చేశారు. చర్చా గోష్టులు 15 నుంచి నాలుగు రోజులపాటు మూడు స్థలాలలో రెండు దఫాలుగా జరిగాయి. మొత్తం 45 వ్యాసాలు చదువబడ్డాయి. వాటిట్లో మలేషియా-తెలుగు వారివి 13. మంత్రి శ్రీ అగిశం వీరప్ప ప్రారంభోత్సవం జరిపారు. 15న సాంస్కృతిక ప్రదర్శనకు ముఖ్యమంత్రి శ్రీ టి. అంజయ్య ప్రారంభోత్సవం జరిపారు. ఆంధ్రప్రదేశ్ విధానసభ సభాపతి శ్రీ కోన ప్రభాకరరావు అధ్యక్షత వహించారు. ఈ ప్రదర్శనం భారత మలేషియాలకు, ముఖ్యంగా ఆంధ్ర మలేషియాలకు గల సంబంధాలు తెలియజేసింది. దీనిలోని కొన్ని కళాఖండాలను కౌలాలంపూర్‌లోని మ్యూజియం నగిరాలో (ప్రభుత్వ మ్యూజియంలో) స్థిరంగా ఉంచడానికి కూడా ఏర్పాట్లు జరపాలని మలేషియా ఆంధ్రసంఘం నిర్ణయించింది. 15న ఉదయం సివిక్ సెంటర్‌లో ప్రతినిధులు సమావేశమై పరస్పరం పరిచయం చేసుకొన్నారు. 16 మధ్యాహ్నం చిరస్మరణీయమైనది. ముఖ్య మంత్రి మరి కొందరు కౌలాపెరాక్ వెళ్ళారు. ఈ పట్టణం ఆంధ్ర సంఘం పుట్టిన స్థలి. 17వ తేదీ మలేషియా ఆంధ్ర సంఘ రజతోత్సవం జరగడం విశేషం. ఆంధ్రప్రదేశ్ అవతరణతో పాటు ఈ సంఘం ఆవిర్భవించింది. రజతోత్సవాన్ని మలేషియా ఉపమంత్రి దాతుక్ కె. పద్మనాభన్ ప్రారంభోత్సవం జరుపుతూ, మలేషియా వివిధ సంస్కృతులు, మతాల సామరస్యానికి పేరు పొందినదని, ఏ భాషయినా, మతమయినా, దేశ సమైక్యానికి ప్రతిబంధకం కాకుండా వృద్ధి చెందాలని అన్నారు. ఈ సందర్భంలో మలేషియా ఆంధ్ర ప్రముఖులను ఆంధ్ర ప్రభుత్వం దుశ్శాలువంతోను, మెమెంటోలతోను సత్కరించింది. ప్రత్యేక సంచిక కూడా ఆవిష్కరించారు. 18వ తేదీ ముగింపు సమావేశానికి ముఖ్య అతిథిగా వచ్చిన కార్మిక నాయకుడు డాక్టర్ పి.వి. నారాయణన్ మలేషియా ఆంధ్ర సంఘం కృషిని ఆంధ్రప్రదేశ్ కళాకారుల ప్రతిభను కొనియాడారు. అధ్యక్షత వహించిన శ్రీ భాట్టం శ్రీరామమూర్తి తెలుగుదేశంలోని సాంకేతిక విద్యాలయాలలో మలేషియా ఆంధ్రులకు ఇతోధికంగా స్థానాలు కేటాయిస్తామని హామీ యిచ్చారు. విదేశాలలోని భారతీయులను ఏకం చేయడానికి తొలిసారిగా ప్రయత్నించిన వాడు నేతాజీ సుభాష్ చంద్రబోస్ గనుక, ఆయన పేర ఒక సాంస్కృతిక సంస్థను నెలకొల్పాలని శ్రీ కోన ప్రభాకరరావు సూచించారు. వచ్చే ప్రపంచ తెలుగు మహాసభలు మారిషస్‌లో జరగాలని మారిషస్ ప్రతినిధి శ్రీ బాల అచ్చన్న ప్రకటించారు. 16వ తేదీన డాక్టర్ దాశరథి అధ్యక్షతన జరిగిన కవి సమ్మేళనం స్థానికులను గిలిగింతలు పెట్టింది. 14వ తేదీ రాత్రి మలేషియా ఆంధ్ర సంఘం "మౌలం మలేషియా" (మలేషియా రాత్రి) శీర్షిక క్రింద జానపద నృత్య సంగీత కార్యక్రమం జరిపారు. నాలుగు రోజులు వరుసగా శంకరాభరణం, భక్త కన్నప్ప, జీవన జ్యోతి, భక్త తుకారాం చలన చిత్రాలు, నిచ్చెనలు (ఎ.ఆర్. కృష్ణ బృందం) మనస్తతత్వాలు (సినీ ఆర్చివ్స్ ఆసోసియేషన్) కృష్ణతులాభారం

(జమునబృందం) నాటకాలు ప్రదర్శించబడ్డాయి. కుమారి రాణి కౌసల్య, శ్రీమతి ఉమా భారతి, కుమారి శోభానాయుడు, శ్రీరాజు, శ్రీమతి రాధారెడ్డి, బేబీ గీతశ్రీ నృత్యాలు ప్రదర్శించారు. శ్రీ విశ్వనాథ భాగవతార్ హరికథ, శ్రీ పి. రామసుబ్బారెడ్డి ఏకపాత్రాభినయం, శోభానాయుడు నృత్యం, బేబీ గీతశ్రీ (ఇదేళ్ళపాప) నృత్యం ప్రేక్షకులను విశేషంగా ఆకర్షించాయి. డాక్టర్ బాల మురళీకృష్ణ, శోభానాయుడు, యావత్ప్రపంచానికే చెందిన కళాకారులుగా ప్రశంస పొందారు. మహాసభలో 936 మంది ప్రతినిధులు పాల్గొన్నారు. వీరిలో నమోదు చేసుకొన్నవారు 896 మంది, నమోదు చేసుకోనివారు 40 మంది. మొత్తం ప్రతినిధులలో ఆంధ్రప్రదేశ్ నుంచి 806, తమిళనాడు-33, కర్ణాటక-10, మహారాష్ట్ర-15, న్యూఢిల్లీ -6, ఒరిస్సా, పశ్చిమ బెంగల్ -21, మధ్యప్రదేశ్, బీహార్- చెరి ఒకరు, ఇతర రాష్ట్ర ప్రతినిధుల మొత్తం 88. విదేశాల నుంచి మారిషస్- 12, యు.ఎస్.ఎ.- 1, సింగపూర్ -15, ఇండోనేషియా, ఫిజీ-12. మొత్తం-40. సభలకి పాల్గొన్న ఆంధ్రప్రదేశ్ మంత్రులు-9, ప్రతిపక్ష నాయకులు-9, సభాపతులు-3, మాజీ మంత్రులు-3, విధాన సభ్యులు-9, పార్లమెంటు సభ్యులు-7, న్యాయమూర్తులు-3, విశ్వవిద్యాలయోపాధ్యాక్షులు -5, సెక్రటరీలు, డైరెక్టర్లు -7. మహాసభలలో జరిగిన అవకతవకలను గురించి ఆంధ్రప్రదేశ్ విధాన సభలో ఏప్రిల్ 29న చర్చలు జరగాయి. పలువురు పలు విధాలుగా మాట్లాడి, అవకతవకలకు కారణం ట్రావెల్ ఏజెంటేనని ముక్తాయింపు చేశారు. మహాసభలలో పాల్గొన్న ఆంధ్రప్రదేశ్, భారతీయ ప్రతినిధులను గురించి కొంత చెప్పాలి. వారిలో అత్యధికులు విదేశంలో ఉన్నామన్న చైతన్యం లేక ఇష్టం వచ్చినట్లు ప్రసంగించారని, ప్రవర్తించారని నా అభిప్రాయం.

నా వరకు నేను మనం పాశ్చాత్య దేశాలతోనే కాదు, మలేషియా వంటి చిన్న దేశంతో కూడా ఏ విషయంలోను (మలేభాష మొన్నటి వరకు జానపద స్థాయిని దాటలేదు. నేడు విశ్వవిద్యాలయాలలో ఉన్నత విద్యకు కూడా మాధ్యమం. మనది ఇటాలియిన్ ఆవ్ ది ఈస్ట్. ఇంకా జిల్లా స్థాయి ప్రభుత్వ భాషగాను ఎదగలేదు) పోటీ చేయలేమవే భయంతో, జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపీ గరీయసీ గనుక, ఉడుతా భక్తిగా జన్మ దేశాన్ని ముందుకు తేవాలనే సంకల్పంతో తిరిగి వచ్చాను. ఏమైనా, విదేశాలలోని ఆంధ్రులలో భావ సమైక్యం కోసం అహర్నిశం కృషి చేసి ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభలు జరిపించిన అంతర్జాతీయ తెలుగు సంస్థ అధ్యక్షుడు శ్రీ మండలి వెంకట కృష్ణారావు మనః పూర్వకంగా అభినందించక తప్పదు.

(తేదీ: 5-6-1981)

## మానవతా మూర్తి మండలి షష్ట్యబ్ది పూర్తి:

శ్రీ మండలి వెంకట కృష్ణారావును తలచుకొన్నప్పుడూ, చూచినప్పుడూ నాకు ఆయన రెండు అవతారాలు జ్ఞాపకం వస్తాయి. మొదటిది ప్రపంచ తెలుగు మహా సభావతారం, రెండవది జలప్రళయావతారం. నిజానికి జల ప్రళయావతారము మొదటి జ్ఞప్తి పథంలో వరుగులెత్తుతుంది. ఎనిమిదిన్నర ఏళ్ళ నాటి సంగతి. ఆనాడు శనివారం, 1977 నవంబరు 19. సూర్యుడు అనుదినమూ ఉదయించినట్లే ఆ దినమూ ఉదయించాడు. ప్రజలు నిత్యకృత్యాలు యధావిధిగానే సాగించారు. కాని ఒకే భేదం. తుఫాను సూచనలున్నాయి. జాగరూకతతో మెలగాలి సుమా!- అని వాతావరణ శాస్త్రజ్ఞులు హెచ్చరికలు చేశారు. సరేలే. ఈ తుఫానులు ఎప్పుడూ ఉండేవే. ఎన్నిటినో చూచాము. దీన్నీ చూద్దాంలే అనుకున్నారు ప్రజలు. దివి సీమ ప్రజలు యాదమరచి నిద్రపోయారు. పాపం వాళ్ళు కలగన్నారా, ఒక్క శతాబ్దం క్రితం మచిలీవట్టణాన్ని ముంచెత్తి వేలాది ప్రజలను పొట్టన బెట్టుకున్న మహా జలప్రళయం కన్నా తీవ్రమయినది తన వికటాట్టహాసంతో విరుచుకు పడుతుందని? రాత్రి కొన్ని గంటలలో అంతా సమాప్తమైంది. సముద్రుడు ఎందుకు ప్రజలను కన్నెర్రజేశాడో. ఎందుకు అంత దారుణంగా దండిచాడో తెలియదు. అలాటి సంకట పరిస్థితులలోనే కదా కొన్ని నిత్యసత్యాలు పునర్నిరూపితమవుతాయి? అగ్నిలో పడితేనే కదా అపరంజి ఏదో తెలుస్తుంది. అప్పుడే గదా పరోపకారాయ సతాం విభూతయః అన్న భర్తృహరి సూక్తి మరొక మారు ప్రపంచమంతటా మారు మోగుతుంది. మారు మ్రోగిన ఆ సూక్తి మానవ రూపమే శ్రీ మండలి వెంకట కృష్ణారావు. శ్రీ మండలి తుఫాను తరిమి కొట్టిన నాడు కాకతాళియంగా అవనిగడ్డలో ఉన్నారు. ఆయనలోని మానవత్వం ఉప్పెన కన్నా ఉవ్వెత్తుగా లేచింది. వేయి మదగజాల బలంతో ఉప్పెన రాక్షసి కరాళకృత్యాలను గురించి తెల తెలవారగానే వేయి పదుల వార్తలు వ్యాపించాయి. మండలి తమ ఒంటి మీద గుడ్డలున్నాయా, లేవా అని కూడ చూచుకోలేదు, పాదచారులై బయలుదేరారు. దివిసీమ అంతా మహాభారత రణరంగంలా వుంది. ఆయన కూలిపోయిన ఇండ్ల మధ్యన నడిచారు. చచ్చిపడిన వశువుల మధ్యన నడిచారు. రాయి రప్ప ముళ్ళు గుళ్ళు సరకు చేయకుండా నడిచారు. తమ ఆరోగ్యం సరిగా లేకపోయినా నడిచారు. జలప్రళయానంతరం మిగిలిన వారి మననులో బలం నింపడానికి నడిచారు. కాళ్ళలో ముప్పై ఆరు ముళ్ళు దిగబడ్డాయి. కాళ్ళకు కట్టు కట్టించుకొని నడిచారు. ఒక్క మాటలో ప్రజల హృదయాలలోనే నడిచారు. విరామమెరుగని నడక పల్లె పల్లెకు తిరిగారు. పరిస్థితి చూచారు. పరితపించారు. పరితాపం పోగొట్టారు. ప్రభుత్వాన్ని కదిలించారు.

ఇలా తుఫానుకు దెబ్బతిన్న ప్రాంతాన్నంతా కాలికి బలపం కట్టుకొని తిరిగారన్న సామెతగా తిరిగారు. ప్రజలలో విశ్వాసం నింపారు. విషాదం పారద్రోలారు. చేయదగిన

సహాయం చేశారు. చేయించారు. మాసిన గడ్డంతో, బెదురు చూపులతో, మోకాళ్ళ పైకి ఎత్తి బొడ్డులో దోపిన ధోవతితో, బురద కాళ్ళతో, జనానికి ఏదో సహాయ వస్తువు అందిస్తున్న చేతులతో మూర్తిభవించిన విషాదం లాగ వున్న ఆయన అవతారాన్ని దేశ దేశాల వారూ దూరదర్శినిలో చూచారు. ఉప్పెన నష్టాన్ని వివరిస్తున్న ఆయన మాటలు విన్నారు. సహృదయతతో సాహయ్య ధనం కురిపించారు. దివిసీమ బాధితులను పునరుజ్జీవింప జేశారు. సర్వ సంస్థల కార్యకర్తలు కుల మత వర్గ రాజకీయ రాద్ధాంత భేదం లేకుండా ఆయనను ప్రశంసించారు. బద్ధశత్రువులు కూడ కొనియాడక తప్పలేదు. జలప్రళయావతారం విషాదావతారమైతే, ప్రపంచ తెలుగు మహాసభావతారం పరమోత్సాహావతారం. మొదటి మహాసభ ఒక తెలుగు జాతర. తెలుగు వారు తమ రెండు మూడు సహస్రాబ్దాల గత చరిత్ర వైభవాన్ని ఆ జాతరలో తెలుసుకొని మురిసిపోయారు. ఎటుచూచినా కనిపిస్తూ, ఎవరిని చూచినా పలుకరిస్తూ, ఏమికోరినా అందజేస్తూ, పరమాణువులోని పరమ సూక్ష్మంశాలలాగ తిరుగుతూ తెలుగు వారి హృదయాలలో పెద్ద పీట వేసుకొన్నారు మండలి. రెండవ ప్రవంచ తెలుగు మహాసభా సంరంభంలో, మలేషియాకు వెళ్ళి ప్రతినిధుల పాస్ పోర్ట్ ఫారంలు పూర్తిచేయడం మొదలు సంతకాలు పెట్టడం, పాస్ పోర్ట్ కార్యాలయానికి ఫోను చేయడం, వాటిని రప్పించడం, ప్రతినిధులకు ఆందజేయడం, వారిని రైళ్ళలో, బస్సులలో, విమానంలో మద్రాసుకు చేరవేయడం, అక్కడ మీనంబాకం విమానాశ్రయంలో వారిని విమానాలు ఎక్కించడం, ఏవో తభావతులు జరిగితే వారిని సమాధానపెట్టడం, దుండగులు దూషించినా ప్రజాకార్యమన్న దృష్టితో పెదవి కదపకపోవడం, తీరా అందరూ విమానాలు ఎక్కినా, తాము ఎక్కలేక విమానాశ్రయంలో దిగబడి పోవడం వరకు- అవన్నీ నాకు చలనచిత్రంలాగ కళ్ల ఎదుట తిరుగుతూ విమాన యాత్రికులకు వీడ్కోలిస్తున్న ఆ ఉత్సాహ తరంగితావతారం తెరనిండా క్లోజప్‌లో కనిపిస్తుంది. ఈ రెండు సంఘటనలు చాలు ఆయన మానవ సేవకుడని, కార్యాచరణ దక్షుడని చెప్పడానికి. ఆయన జీవితం సార్థకమని నిరూపించడానికి. శ్రీ మండలి ధైర్య సాహసాలు పెనగొన్న రాజనీతిజ్ఞుడు. గాంధీ మార్గాన్ని నమ్మిన సమతావాది. ఉపజ్ఞగల వ్యవస్థాపకుడు. విశ్రాంతి ఎట్టిదో ఎరుగని విశుద్ధకార్యకర్త. నిరాడంబరత, నిర్వ్యసులభత నిండారిన నాయకుడు. పదవి ఉన్నా, ఊడినా వాడని పొగడపూవు. ఒక్క మాటలో ప్రజల మనిషి. ఇంతటి ఉత్సాహానందాలతో నవయువకుడుగా నవ యువతను నడిపిస్తున్న శ్రీ మండలికి షష్ఠబ్ది పూర్తి అంటే ఆశ్చర్యం- నా మట్టుకు నాకు అయినా. నూట యిరవై యేళ్ళ పూర్ణాయుస్సులో ఇది సగమే కదా, ఇంకా ఆరు దశాబ్దాల పాటు ఆయన సేవను ప్రజలు అందుకోవచ్చు గదా అని మనస్సును ఊరడించుకొన్నాను. సేవ, సహృదయత కరవైపోయిన ఈ కటక కాలంలో శ్రీ మండలి వంటి ప్రజాసేవా పరాయణులు చాలా

అరుదు. వారు చాలా అవసరం. ఆగస్టు 4వ తేదీకి 60 ప్రజాసేవా సంవత్సరాలు నిండిన శ్రీ మండలిని మనసారా అభినందిస్తూ, ఇక ఆరు సేవా దదశాబ్దాల పాటు ఆరు పదుల సేవా సంస్థలను నిర్వహిస్తూ, తమ వంటి, తమను మించిన సేవాదురంధరులను రూపొందించాలని, అలాటి శక్తిస్థైర్యాలు ఆయనకు లభించాలని కోరుకుంటున్నాను (నా కోరికలేవి ఇంతవరకూ వ్యర్థంకాలేదు.)

(తేదీ: 15-8-1986)

**శ్రీ జత్తి పిలుపు:**

శ్రీ మండలి వెంకటకృష్ణారావు వషష్టి పూర్త్యుత్సవం సందర్భంగా ఆగస్టు 9వ తేదిన గాంధీభవన్‌లో జరిగిన సభకు అధ్యక్షత వహించిన మాజీ ఉప రాష్ట్రపతి శ్రీ బసప్ప దానప్ప జత్తి, దేశ యువకులకు చేసిన హిత బోధ ఎంతో సమంజసంగా వుంది. నేడు జాతీయ సమగ్రత అత్యవసరం. దేశంలో పెక్కు చోట్ల విచ్ఛిన్నకర శక్తులు విజృంభించి దేశాన్ని విచ్ఛిన్నం చేయడానికి ప్రయత్నిస్తున్నాయి. అలాటి విచ్ఛేదం జరుగకుండా, దేశ సమగ్రతకు జీవితం అంకితం చేయవలసిన బాధ్యత నేటి యువకుల పైన, మేధావులె పైన వున్నది అని శ్రీ జత్తి ఉద్బోధించారు. శ్రీ జత్తి దృఢ గంభీర కంఠంతో ఇంకా ఇలా అన్నారు– "దేశంలో నేడు విస్తరించిన విచ్ఛిన్నకర ధోరణులను తీవ్రంగా అణచి వేయాలి. దానికి అందరూ ఉద్యమించాలి. ప్రాంతీయాభిమానం మంచిదే. కాని, అది దురభిమానంగా పరిణమించి, విభేదాలను, జాతి విద్వేషాలను సృష్టించరాదు. ఇది చాలా ఘోరమైన విషయం. అలాటి విభేదాలకు, విద్వేషాలకు అవకాశం లేకుండా, జాతి సమైక్యం పెంపొందడానికి, అందరూ కృషి చేయాలి. ఈ పనికి మేధావులు ముందుకు రావాలి. వారు కుల మతరహిత సమాజాన్ని నెలకొల్పడానికి నడుం కట్టాలి. మేధావులు జనానికి దేశ పరిస్థితులు మొదలయిన వాటిని వివరించాలి. ఎంతో పరిశ్రమతో సాధించిన జాతి సమైక్యాన్ని పరిరక్షించుకోవలసిన అవసరాన్ని నొక్కి చెప్పాలి. మరొక సంగతి. అన్ని సమస్యలకు మూలం దారిద్ర్యం. దేశం ప్రగతి పథంలో నడవాలంటే, దారిద్ర్యాన్ని పారద్రోలాలి. దళితులను పైకి తెచ్చినప్పుడే, దేశంలో అందరికి సామాజిక, ఆర్థిక సమానత్వం లభిస్తుంది. అలాటి సేవాతత్పరతను, సమానత్వ దృష్టిని యువకులు అలవరుచుకోవాలి. మేధావులయిన పెద్దలు యువకులకు అలాటి భావాలు కలిగించడానికి తగిన శిక్షణ ఇవ్వాలి." తర్వాత శ్రీ జత్తి శ్రీ మండలి సేవా పరాయణతను వివరిస్తూ, దివిసీమలో ఉప్పెనకు గురైన ప్రజలకు శ్రీ మండలి చేసిన అపార సేవను పేర్కొంటూ, సేవాపరాయణులుగా శ్రీ మండలి పేరు పొందారని, ఇటీవలి కాలంలో తెలుగు సంస్కృతిని ప్రపంచం నలుమూలలా చాటి చెప్పిన వారు శ్రీ మండలి అని

ప్రశంసించారు. యువకులు శ్రీ మండలి సేవా తత్పరతను, ఓర్పును, దీక్షను అలవరచుకోవాలని శ్రీ జత్తి సూచించారు. మాజీ రాష్ట్ర ముఖ్యమంత్రి, మాజీ కేంద్ర మంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి శ్రీ మండలిని అభినందిస్తూ, ఆయన రాజకీయ జీవితాన్ని, సేవాభావాన్ని ప్రశంసించారు. ఒరిస్సా మాజీ గవర్నర్ మీర్ అక్బర్ అలీఖాన్ శ్రీ మండలి కృష్ణారావు షష్ట్యబ్ది పూర్తి సంచికను ఆవిష్కరించారు. మహాకవి డాక్టర్ దాశరథి పరిచయ వాక్యాలు పలికారు. ఈ సంచికలో ప్రముఖుల వ్యాసాలు, అభినందన కవితలు ఉన్నాయి. శ్రీ మండలి అవనిగడ్డలో నిర్వహిస్తున్న కొన్ని సేవాశ్రమాల నిర్వహణ కోసం కొందరు ప్రముఖులు విరాళంగా ఇచ్చిన లక్ష రూపాయల చెక్కును శ్రీ జత్తి శ్రీ మండలికి అందజేశారు. డాక్టర్ సుంకు బలరాం శ్రీ మండలికి ఒక బంగారు గొలుసున్న గడియారాన్ని బహూకరించారు. దానిని శ్రీ మండలి అవనిగడ్డ గాంధి సేవాశ్రమ నిర్వహణ నిధికోసం సభలోనే వేలం వేశారు. శ్రీ విజయ శిఖామణి ఆ గడియారాన్ని రెండువేల అయిదు వందల రూపాయలకు పాటపాడి కొన్నారు. ఈ సందర్భంలో కవి సమ్మేళనం జరిగింది. డాక్టర్ దాశరథి, డాక్టర్ దివాకర్ల వెంకటావధాని, డాక్టర్ బోయి భీమన్న, డాక్టర్ అరిపిరాల విశ్వం, డాక్టర్ నాయని కృష్ణకుమారి, డాక్టర్ యశోదారెడ్డి, శ్రీ విశ్వనాథ, శ్రీ కృష్ణదేవరాయలు, శ్రీ విజయ శిఖామణి మున్నగువారు పాల్గొన్నారు. కవులు శ్రీ మండలిని పొగడక, తమ ఇష్టం వచ్చిన కవితా ఖండికను గానం చేయడం ఈ కవి గోష్ఠి విశిష్టత. శ్రీ మండలి దంపతులు ఈ సందర్భంలో 60 మంది కవి పండిత, గాయక శిల్పి, చిత్రకారులను, స్వాతంత్ర్యయోధులను సన్మానించారు. సన్మానితులైన కవి పండితులలో పైన పేర్కొన్న కవి గోష్ఠిలో వారు. కళాకారులలో శ్రీ పి.టి. రెడ్డి, శ్రీ నూకల చినసత్యనారాయణ, శ్రీ ఎల్లా వెంకటేశ్వరరావు మున్నగువారు. స్వాతంత్ర్యయోధులలో శ్రీయుతులు బ్రహ్మానందరెడ్డి, పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి, దేవులపల్లి రామానుజరావు, డాక్టర్ పి. తిరుమలరావు మున్నగు వారున్నారు.

(తేదీ: 5-9-1986)

**విద్యామంత్రి హామీ:**

మహాకవి గురజాడ వారి అప్రకటిత రచనల లిఖిత పుస్తకాలు, వ్రాత పరికరాలు, సాంస్కృతిక దృష్ట్యా అమూల్యమైన తదితర వస్తువులను సేకరించి ఒక మ్యూజియంలో భద్రపరచాలని ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం ప్రధాన కార్యదర్శి శ్రీ రాంభట్ల కృష్ణమూర్తి సెప్టెంబరు 22న భారత గుణ వర్ధక్ సంస్థలో జరిగిన గురజాడ రచనల గోష్ఠిలో చేసిన సూచనను అధ్యక్షత వహించిన విద్యామంత్రి శ్రీ ఎం.వి. కృష్ణారావు ఆమోదించడం ఎంతో బాగుంది. ఒక్క గురజాడ వారిదే కాదు, యావదాంధ్ర విఖ్యాతులైన రచయితలందరి లేఖన సామగ్రి, గ్రంథాలయం మొదలయిన వన్నిటినీ

సేకరించి భద్రపరచాలి. తిక్కన గంటం విషయంలోనే శ్రద్ధ చూపని ప్రభుత్వం తక్కిన వారి విషయంలో అసక్తి చూపుతుందా? అని పలువురు విద్యావేత్తలు అనుమానిస్తున్నారు. గనుక ప్రపంచ తెలుగు మహాసభలలోనైనా ఇలాటి సత్కార్యాలు జరగాలి.

(తేదీ: 18-10-1974)

**ప్రపంచ హిందీ మహాసభ:**

నాగపూర్ టైమ్స్ మేనేజింగ్ ఎడిటర్, ప్రపంచ హిందీ మహాసభ ప్రధాన కార్యదర్శి శ్రీ అనంతగోపాలషోరి అక్టోబరు 6వ తేదీన పత్రికా ప్రతినిధులతొ ముచ్చటిస్తూ, ప్రపంచ హిందీ మహాసభ వచ్చే జననరిలో నాగపూర్‌లో జరుగుతుందని, ఇది జాతీయ సమైక్యానికే కాక అంతర్జాతీయ సమైక్యానికి తోడ్పడుతుందని అన్నారు. దీనికి దేశంలోని వివిధ ప్రాంతాల నుంచి 2000 మంది, విదేశాల నుంచి 200 మంది ప్రతినిధులు పాల్గొంటారని తెలిపారు. హిందీ పీఠాలున్న 21 దేశాల 99 విశ్వవిద్యాలయాల నుంచి ప్రతినిధులు వస్తారన్నారు. వివిధ దేశ భాషల విద్వాంసులను, రచయితలను సన్మానిస్తుందని అన్నారు. శ్రీ కిషోర్ ముఖ్యమంత్రి శీ వెంగళరావును, విద్యామంత్రి శీ కృష్ణారావును కలుసుకుని వివిధ విషయాలు వివరించారు. ప్రపంచ హిందీ మహాసభలో విద్యామంత్రి శ్రీ కృష్ణారావు నాయకత్వాన ప్రపంచ తెలుగు మహాసభ ప్రతినిధి వర్గం పాల్గొంటుందని తెలుస్తున్నది. ప్రపంచ తెలుగు మహాసభ ప్రధాన కార్యదర్శి శ్రీ పి.ఎన్.ఆర్. అప్పారావు, కార్యదర్శులు శ్రీయుతులు బాపురెడ్డి, ప్రసాదరావు మహాసభ ఆశయాలు శ్రీ కిషోర్‌కు తెలియజేశారు.

(తేదీ: 1-11-1974)

**బాలల అకాడమీ:**

అంధ్రప్రదేశ్‌లోని వివిధ తెలుగు బాలల సంఘాల కార్యకలాపాలను సమన్వయ పరచడానికి బాలల అకాడెమీని స్థాపించడానికి రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించినట్టు విద్యామంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు అక్టోబరు 23వ అఖిల భారత తెలుగు బాలల ఉత్సనంలో ప్రకటించడం బాలల సంఘాలవారికి చాలా సంతోషం కలిగించింది నేటి బాలలే రేపటి పౌరులు. బాలబాలికలలో అంతర్నిహితమైన శక్తులను ఉద్దీపం చేయడంలో ప్రభుత్వం తీసుకున్న ఈ శ్రద్ధ ఎంతో ప్రశంసనీయమని వేరుగా చెప్పనక్కర్లేదు. ఈ అఖిలభారత తెలుగు బాలల మహోత్సవం 23న తేదీ నుండి నాలుగు రోజులపాటు మహావైభవోపేతంగా కేశవ మెమోరియల్ స్కూలు ఆవరణలో జరిగింది. దీనిలో కలకత్తా, మద్రాసు, బరంపూర్, ఖరగ్‌పూర్, బొంబాయి, ఢిల్లీ, బెంగుళూరు మొదలైన ప్రాంతాల నుండి వచ్చిన ప్రతినిధులతో సహా దాదాపు వేయిమంది బాలల

ప్రతినిధులు పాల్గొన్నారు. ఆర్థిక మంత్రి శ్రీ పిడతల రంగారెడ్డి అధ్యక్షత వహించారు. ప్రధాన న్యాయమూర్తి శ్రీ ఓబుల్‌రెడ్డి ప్రారంభోత్సవం జరిపారు. రవాణాశాఖా మంత్రి శ్రీ చొక్కారావు పుస్తక ప్రదర్శనానికి ప్రారంభోత్సవం చేశారు. మహిళా సంక్షేమశాఖా మంత్రిణి శ్రీమతి ఎం. లక్ష్మీదేవి ప్రత్యేక సంచికను ఆవిష్కరించారు. నాలుగు రోజులపాటు బాలల అభివృద్ధికి తీసుకోవలసిన చర్యలపై గోస్టులు, సదస్సులు, ప్రసంగాలు, చర్చలు, కవి సమ్మేళనాలు, బాల కళా ప్రదర్శనలు జరిగాయి. ముగింపు సమావేశంలో ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు ప్రసంగిస్తూ, దేశ సమైక్యానికి ప్రాథమికావసరంగా తెలుగువారిలో బావసమైక్యం అత్యావశ్యకమని, దానికి ఇలాటి బాలల మహోత్సవాలు దోహదం చేస్తాయని అన్నారు. అధికార బాష అయిన తెలుగు భాషకు నూతనోత్తేజం కలిగించడం బాలల విద్యనుంచే ప్రారంభం కావాలని అధికార భాషా కమిషన్ అధ్యక్షులు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య, పిల్లల మనోవికాసానికి దేశయాత్ర అవనరనుని ఆరోగ్యశాఖామంత్రి శ్రీ రాజమల్లు ప్రసంగించారు. నవంబరు నాల్గవ వారంలో అంతరరాష్ట్ర బాలల మహోత్సవం జరుగుతుందని, మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ గోపాలరావు ఎక్‌బోటే అధ్యక్షతన దీనికి ఆహ్వాన సంఘం ఏర్పడిందని విద్యామంత్రి శ్రీ మండలి కృష్ణారావు ప్రసంగించారు తెలుగు బాలల అభ్యున్నతి కోసం జీవితమంతా ధారపోసిన రేడియో అన్నయ్య, రేడియో అక్కయ్య శ్రీ న్యాపతి రాఘవరావును, శ్రీమతి న్యాపతి కామేశ్వరమ్మను ముఖ్యమంత్రి సన్మానించడం ఉత్సవానికి ముక్తాయింపుగా అందరికీ మహానందం కలిగించింది.

(తేదీ: 22-11-1974)

**కొత్త విశ్వ విద్యాలయం:**

నాగార్జున, కాకతీయ విశ్వవిద్యాలయాలు త్వరలో నెలకొననున్నవని విద్యా మంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు జూన్ 17న మరొకమాటు అనడం బట్టి ఈ విద్యా సంవత్సరానికి ఆ రెండూ ఏర్పడతాయనడం స్పష్టం. విశ్వవిద్యాలయాలు నిర్వహణ, అందులోను నూతన విశ్వవిద్యాలయాల నిర్వహణ ఎంత కష్టమో చెప్పనక్కర లేదు. విద్యారుల అదృష్టమా అని శ్రీ జగన్మోహనరెడ్డి వంటి సమర్థుడు రాబట్టి ఉస్మానియా విశ్వవిద్యాలయం చక్కబడే దోవను ఎక్కింది. కనుక కొత్త విశ్వవిద్యాలయాలకు కులపతి కాగలవారు సమర్థ పరిపాలకుడు, దేశ విఖ్యాత విద్యావంతుడు ఆయి ఉండడం అవసరం. వరంగల్, గుంటూరు స్నాతకోత్తర కేంద్రాలను ప్రారంభదశలో చక్కగా నిర్వహించి, అవినీతికి దూరంగా, నీతికి దగ్గరగా చేసిన ప్రత్యేకాధికారుల ప్రిన్సిపాలుల, సమర్థతను అర్హతను కూడ ఈ సందర్భంలో ముఖ్యమంత్రి, విద్యామంత్రి తదితర తత్సంబంధ అధికారులు పరిశీలించడం అవసరం. గొప్ప విద్వాంసుడూ కులపతి

అయితే విద్యార్థులు గౌరవిస్తారు. కరుకైన పరిపాలకుడయితే భయపడుతారు. ఈ రెండు గుణాలూ కలవారయితే అపరంజికి తావి అబ్బినిట్లు, ఇలాటివారికి ఆంధ్రప్రదేశ్ లో కరువు ఉందా? లేదనే నా అభిప్రాయం.

(తేదీ:18-7-1975)

**తెలుగు వైభవం మ్యూజియం:**

రాక్షస ఉగాదికి జరిగిన ప్రపంచ తెలుగు మహాసభల ఫలితాలలో రెండవది "తరతరాల తెలుగు వైభవం" మ్యూజియం. దీనికి రాష్ట్రపతి శ్రీ ఫక్రుద్దీన్ అహమద్ ఆలీ సెప్టెంబర్ 13వ తేదీన భాగయామ్ లో శంఖుస్థాపన చేయడం తెలుగుజాతి చరిత్రలో అపూర్వ ఘట్టం. రాష్ట్రపతి తమ ప్రసంగంలో సూచించినట్టు తెలుగువారి గత వైభవ చిహ్నాలైన స్తూపాది సంపద బ్రిటీష్ మ్యూజియం, మద్రాసు మ్యూజియం, మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారం, సరస్వతీ మహల్, లైబ్రరీ మున్నగు పెక్కు స్థలాలలో సంగృహీతమై వుంది. దీనిని ఈ కొత్త మ్యూజియంకు సంపాదించడం, లేక వాటి ప్రతికృతులనన్నా సంపాదించడం అవసరం. ఆ మధ్య బుద్ధ జయంతి పంచ వింశ శత వార్షికోత్సవం సందర్భంగా ప్రత్యేక సంచికలు వేయవలసి వచ్చినప్పుడు ఎక్కువ భాగం ప్రతికృతుల ఫొటోలు, శిల్పవాస్తు ప్రతిరూపాలు బ్రిటీష్ మ్యూజియం నుంచి తెప్పించవలసి వచ్చింది. అవి అక్కడ భద్రంగా వున్నందుకు బ్రిటీష్ జాతికి మనం ఎంతో కృతజ్ఞులమై వుండాలి - ఎందుకంటే మన పూర్వులు, ఇప్పటి వారూ కూడా వాటి విలువ తెలియక దేవాలయాల మూల బంధాలలో వేయడం, సున్నవురాళ్ళలో కలిపి వేయడం చరిత్రవేత్తలకు తెలిసిన నంగతి. గవర్నర్ శ్రీ ఓబులరెడ్డి తెలుగువారి స్వభావాన్ని సమర్థించారు. తన ప్రసంగంలో ఈ సందర్భంలో సవినయంగా మనవి చేయవలసివుంది. "దో కనోజ్ తీన్ చూలే?" ఇద్దరు కనోజువారు, మూడు పొయ్యలు- అని హిందీ సామెత. అంతభేదం అన్నమాట ఈ సామెత తెలుగువారికి పూర్తిగా అన్వయిస్తుంది. తెలుగువారికి ఉన్న మంచి గుణాలతోపాటు అవలక్షణాలూ చాలా ఉన్నాయి. రెండు మూడు ఆంధ్ర సంఘాలు లేని పట్టణం వుండదు. అసహనం, వాక్ చాపల్యం మనకు మరీ ఎక్కువ. ఇన్ని విశ్వవిద్యాలయాలు వచ్చాయి. ఇన్ని కళాశాలలు లేచాయి. ఇన్ని డిగ్రీలు అబ్బాయి, అయినా విమర్శనం సహించే గుణం మాత్రం మనకు లేదు. "నేను చెప్పింది వేదవాక్యం. వీడేమిటి నన్ను అనడం!" అనే ధోరణిలో వుంటుంది మన విశ్వవిద్యాలయాచార్యుల ధోరణి. ఇలాగే ఇతరుల ధోరణి. మన జాతి భారత సమాఖ్యా మాలికలో మణిపూస కావాలంటే, ఇతర రాష్ట్రాల వారి, ఇతర దేశాల వారి గుణగణాలు పూర్తిగా మనం అలవరచుకోవాలి.

(తేదీ: 10-10-1975)

**మా తెలుగు తల్లికి మల్లెపూదండ:**

నేను మరణించినా నా పాటలు మరణించవు అన్నాడు రవీంద్ర కవీంద్రుడు ఒక సందర్భంలో. ఆ పాట జన ప్రియమైతే దాని ఆయుష్షు సహస్ర శతాబ్దాలు. మిత్రుడు శ్రీ శంకరంబాడి సుందరాచారి నాలుగు దశాబ్దాల క్రితం అలవోకగా వ్రాసిన "మా తెలుగుతల్లికి మల్లెపూదండ" గేయాన్ని రాష్ట్ర సమైక్య సాధనంలో వజ్రలేపంగా, మూడు ప్రాంతాలను. కలిపే ముప్పేటముడిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం భావించడం, దానిని జాతీయగీతం తర్వాత ప్రతి సమావేశ ప్రారంభంలోను పాడాలని ఆనతి ఇవ్వడం ఎంతో సముచితంగా వున్నాయి. శంకరంబాడి ఈ ఒక్కపాటతోనే యోగీశ్వరులలాగా జీవన్ముక్తుడయ్యాడనే నా సంపూర్ణ విశ్వాసం. ఈ నిర్ణయం చేసినందుకు రాష్ట్ర ప్రభుత్వాన్ని, విద్యామంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావును అభినందిస్తున్నాను.

(తేదీ: 28-11-1975)

**విశ్వనాథ, పేర పీఠాలు :**

కళాభవన్‌లో అక్టోబర్ 31న జరిగన విశ్వనాథ స్మారక సంఘం సభలో విద్యామంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు ప్రసంగిస్తూ రాష్ట్రంలోని మూడు విశ్వవిద్యాలయాలలో విశ్వనాథ సత్యనారాయణ పేర సాహిత్య పీఠాలు నెలకొల్పదలచామన్నారు. పింగళ నామ సంవత్సరం శ్రీరామనవమికి విశ్వనాథపై విశేష సంచిక వెలువడుతుందని అన్నారు. అధ్యక్షత వహించిన స్మారక సంఘాధ్యక్షుడుశ్రీ పి.వి. నరసింహారావు తన ప్రసంగంలో విశ్వనాథ జాతీయకవి అని, వంద సంవత్సరాల వరకు పరిశోధన చేయదగినంత సాహిత్యాన్ని వివిధ ప్రక్రియలలో ఆయన సృష్టించారని, ఆయన రచనలను ఇతర భాషలలోకి అనువదించవలసిన అవసరం ఉందని అన్నారు. ఈ సందర్భంలో జరిగిన అనేక భాషా కవిసమ్మేళనంలో 25 మంది కవులు పాల్గొన్నారు. శ్రీయుతులు కమల్ ప్రసాద్ కమల్ (ఉర్దూ), కప్పగంతుల లక్ష్మణశాస్త్రి (సంస్కృతం), డాక్టర్ శ్రీరామ్ శర్మ (హిందీ), ఎల్.డి. కులకర్ణి (మరాఠి), ఎం.ఎన్. మహంతయ్య(కన్నడం), ఎం.ఎస్. కోటీశ్వరన్ (తమిళం), ఏల్.బి. భట్ (గుజరాతీ), ఎల్.సి. సిన్హా (బెంగాల్), ఇ.ఎస్. పురుషోత్తమన్ (ఆంగ్లం), మాధవన్ (మలయాళం), శరభాచార్యులు (సంస్కృతం), గుంటూరు శేషేంద్ర శర్మ మొదలైనవారు తెలుగులోను విశ్వానాథకు కవితాంజలి సమర్పించారు. శ్రీ డాక్టర్ దాశరధి, వానమామలై వరదాచార్యులు రాలేదు.

(తేదీ: 26-11-1976)

## ముస్లిం విద్యా మహాసభ :

రాష్ట్రపతి శ్రీ  ఫక్రుద్దీన్ అహమ్మద్ అక్టోబర్ 30న కింగ్ కోఠీలో అఖిల భారత ముస్లిం విద్యామహాసభ 6వ సమావేశం ప్రారంభిస్తూ, స్త్రీ పురుషుల విద్యకు ఇస్లాం ఎంతో ప్రాధాన్యమిచ్చినా, ముస్లింలు విద్యారంగంలో వెనుకబడి ఉన్నారన్నారు. సమావేశానికి దేశం నలుమూలల నుండి ప్రతినిధులు, విదేశ పరిశీలకులు వచ్చారు. సమావేశానికి డాక్టర్ సి.కె. అబ్దుల్ గఫార్ అధ్యక్షత వహించారు. ఆహ్వాన సంఘాధ్యక్షులు మంత్రి శ్రీ ఆసిఫ్ పాషా స్వాగతం చెప్పారు. ప్రత్యేక సంచికను గవర్నర్ శ్రీ భండారే ఆవిష్కరించారు. మత భాషాల్ప సంఖ్యాకులకు రాజ్యాంగంలో ప్రత్యేక రక్షణలున్నాయని ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు అన్నారు. ప్రత్యేక ప్రదర్శనాన్ని విద్యామంత్రి శ్రీ ఎం.వి. కృష్ణారావు ప్రారంభించారు. మహాసభ మూడులోజుంపాటు జరిగింది. రాష్ట్రపతి అక్టోబర్ 30వ తేదీన జూబ్లీహాలులో జాతీయసమైక్యం 20 సూత్రాల  ఆర్థిక కార్యక్రమం గోష్టిని ప్రారంభించారు. రాష్ట్రపతి 29న ఇక్కడికి రాగానే సాయంకాలం లాల్ బహదూర్ స్టేడియంలో ఏర్పాటయిన ఆసియా బాడ్ మింటన్ పోటీలకు ప్రారంభోత్సవం చేశారు. శ్రీమతి అబిదా అహమ్మద్ ముస్లిం విద్య మహాసభ మహిళా విభాగాన్ని ప్రారంభిస్తూ, వర్ధమాన దేశాల సర్వతోముఖాభివృద్ధికి మహిళల పాత్ర అతి ముఖ్యమన్నారు. 31న శ్రీమతి అబిదాను దక్షిణ మధ్య రైల్వే మహిళా సంఘం సన్మానించింది. రాష్ట్రపతి దంపతులు, నవంబరు 1వ తేదీన ఢిల్లీ వెళ్ళారు.

(తేదీ: 26-11-1976)

## బాలల అకాడెమీ అవతరణ:

మన రాష్ట్రం బాలల అకాడెమీ స్థాపనతో మరొక విషయంలో మార్గదర్శకమైంది. సెప్టెంబర్ 14వ తేదీన జూబ్లీ హాలులో జరిగిన ఉత్సవంలో రాష్ట్రపతి ఫక్రుద్దీన్ ఆలీ అహ్మద్ ఈ అకాడెమీకి ప్రారంభోత్సవం జరువుతూ, దేశ అమూల్య సంపద అయిన బాలబాలికల ఎడల సరైన శ్రద్ధ చూపడం ద్వారానే దేశాన్ని సుసంపన్నం చేయగలనున్నారు. పిల్లల  సర్వతోముఖాభివృద్ధికి ఈ అకాడెమీ కృషి చేయగలదని ఆయన ఆశాభావం వెల్లడించారు. విద్యాశాఖామంత్రి శ్రీ  మండలి కృష్ణారావు స్వాగతం చెపుతూ, సచిత్ర బాలల విజ్ఞాన సర్వస్వం ప్రకటిస్తామన్నారు. గవర్నర్ శ్రీ భండారే, ముఖ్యమంత్రి  శ్రీ జలగం వెంగళరావు, శ్రీమతి  బేగం అబిదా, మహిళా సంక్షేమ శాఖ మంత్రిణి శ్రీమతి కృష్ణవేణి సంజీవయ్య అకాడెమీ మూడు పూవులు ఆరు కాయలు కావాలని ఆశించారు. బాలల అకాడెమీ ఆర్థిక సలహాదారు డాక్టర్. అంతటి నరసింహం సందేశాలు వినిపించారు. అకాడెమీ కార్యదర్శి శ్రీ న్యాపతి రాఘవరావు ధన్యవాదాలు తెలిపారు. (తేదీ: )

**రాష్ట్రస్థాయి బాలోత్సవం:**

విద్యామంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు సెప్టెంబర్ 26వ తేదీన రవీంద్రభారతిలో ఆంధ్ర బాలానందసంఘం 11వ నాటకోత్సవం ప్రారంభిస్తూ, వచ్చే జనవరిలో రాష్ట్ర బాలల అకాడెమీ పెద్ద ఎత్తున రాష్ట్ర స్థాయిలో ఉత్సవాలు జరుపుతామని ప్రకటించారు. ఆంధ్ర బాలానంద సంఘం 1957లో స్థాపితమైనది మొదలు బాలబాలికల మనో వికాసానికి చేస్తున్న అపార సేవను ఆయన ప్రశంసించారు. పట్టణ భూముల గరిష్ట పరిమితి ప్రత్యేకాధికారి శ్రీ కె. మోహన్ ముఖ్య అతిథిగా పాల్గొని బాలానంద సంఘం సేవను వివరించారు. సెయింట్ అంతోనీ హైస్కూలు కళామయి బాలానంద సంఘం 'శకుంతల' నృత్య నాటకాన్ని, సీనియర్ సర్టిఫికేట్ స్కూలు 'విముక్తుడు' నాటకాన్ని, ప్రగతి బాలానంద సంఘం 'ఎవరుదొంగ' నాటికను, నవీన్ బాలానంద నంఘం 'కాంతికిరణం' నాటికను ప్రదర్శించాయి. శ్రీపతి న్యాపతి కామేశ్వరి స్వాగతం చెప్పారు. శ్రీ న్యాపతి రాఘువరావు ధన్యవాదాలర్పించారు.

(తేదీ: )